


న ట రా జ స్వా మి



చిదంబర నటరాజస్వామి ఆలయపు పశ్చిమ గోపురము

Photo By Mr. S. T. ARASU



నటరాజస్వామి ఆలయపు మూలస్థాన కనకమయ గోపురము

Photo By Mr. S. T. ARASU



ఇండియా హోంశాఖామంత్రి శ్రీ గోవిందవల్లభ్ పంత్ గారు ఫరీదాబాద్‌లో శరణార్థులకని ఏర్పడిన లాంతరుల ఫ్యాక్టరీకి ప్రారంభోత్సవం చేసినప్పటి దృశ్యము. ఈ చిత్రంలో కేంద్ర పునరావాసమంత్రి మెహర్‌చంద్ ఖన్నా కూడయున్నారు.

ఈ సంస్థలోని 400 మంది శ్రామికులలో 380 మంది శరణార్థులు.

మాయవరమునందలి మయూరనాథస్వామి
ఆలయ ముఖద్వారము






వ్యవస్థాపకులు :

డాక్టరు కే. యన్. కేసరి


# గృహలక్ష్మి

విజ్ఞాన వినోద ఆరోగ్య సౌభాగ్యములను
పెంపొందించుటకు ఏర్పడిన స్త్రీల
సచిత్ర మాస పత్రిక


ఆక్టింగ్ ఎడిటర్ :

సి. సి. పున్నయ్య



సంపుటము 24]  డిశంబరు 1955  [సంచిక 12

# విషయసూచిక





మాయవరం చిదంబరం మధ్యమార్గమున నున్న వైదీశ్వరాలయపు కోనేరు

Photo by Mr. M. G. MENON



రాష్ట్రపతి డాక్టరు రాజేంద్రప్రసాదుగారు జమ్ము - కాశ్మీరుకు యీ మధ్య వెళ్ళినప్పుడు శ్రీనగర్
దగ్గర జీలంనదిలో పడవలమధ్య ఉత్సవంగా తీసికొని వెళుతున్న దృశ్యము




జయజయ గృహలక్ష్మీ సఖీ! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతిమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



## ఈ సంచిక

గృహలక్ష్మి పత్రికా నిర్వహణకు పూజ్యులు డాక్టరు కే. యన్. కేసరిగారుపక్రమించి యీ సంచికతో 24-వ సంపుటము పూర్తియగుచున్న సందర్భమున గృహలక్ష్మి పాఠకులకు, అభిమానులకు, రచయితలకు, రచయిత్రులకు మా కృతజ్ఞతను తెలియజేయవలసియున్నది.

ఈ సందర్భమున అనాదినుండి గృహలక్ష్మిలో వెలువడుతూవచ్చిన పాకకళ, గృహవైద్యం, బ్రతుకు తెరువులాంటి శీర్షికల రచయిత్రులయొక్క ఆసక్తి, పరిశోధనాత్మకమైనకృషి లోపంవలన కుంటుబడటం చాల విచారకరము.

మహిళా సమస్యలను గురించినవి, సంక్షేమ కార్యకలాపాలను గురించినవైన వ్యాసాలైనా, నిర్మాణాత్మకమైన సూచనలతోటి, సలహాలతోటి మహిళాభ్యుదయాన్ని ప్రోత్సహించేవి, ప్రజాహితాన్ని ఉద్దేశించినవి బహు కొద్దిగా వస్తున్నవి.

నాటికలు, కథానికలు, గేయ, పద్య రచనలు సయితం క్రొంగ్రొత్త రీతులలో, విద్య, విజ్ఞాన, వినోదములను ప్రోత్సహించునవిగా నుండాలని మా కోరిక.

పత్రికా నిర్వహణలో మీరు మాకు నెరపుచున్న సహకారమునకు, మీ ఆదరాభిమానములకు సదా కృతజ్ఞులము. మీ అభిమాన ఆశీస్సులతోనే గృహలక్ష్మి కలకాలము వర్ధిల్లాలి.

---

# సంతాప సానుభూతులు

సంస్కృతాంధ్రములందు చక్కని పాండిత్యము కలిగిన సరస్వతీ రామాయణ కృతికర్త, గృహలక్ష్మి స్వర్ణకంకణ గ్రహీత, పత్రికా రచయిత్రి శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారు నవంబరు 27-వ తేదీన పరమపదించిరను వార్త అత్యంత సంతాపమునకు కారణమయినది.

శ్రీమతి సరస్వతీదేవిగారు కొంతకాలము గృహలక్ష్మి సంపాదకవర్గములో పనిచేశారు. ఈమెకు సాహిత్యోపాసనపట్ల, మహిళాభ్యుదయముపట్లగల ఆసక్తి అనన్యమైనది. ఈమె నిర్యాణం సారస్వతలోకానికి పెద్దలోటు.

ఈనాడు పురోభివృద్ధి దశలోనున్న కేసరి విద్యాలయముల స్థాపనకు మూలపురుషులలో శ్రీ బి. సోమయ్యగారొకరు. మద్రాసు నగరంలో తెలుగు బాలబాలికలకు విద్యవసతులు లోపభూయిష్టంగానున్న విషయాన్ని గుర్తించి మైలాపూరు ప్రాంతమందలి తెలుగు ప్రజానీకాన్ని ప్రోత్సహించి మొట్టమొదట తెలుగు ప్రథమిక పాఠశాలను, క్రమంగా ఉన్నత పాఠశాలలను స్థాపించి, నిర్వహణా బాధ్యతలను నిర్వహించినవారు శ్రీ సోమయ్యగారు.

శ్రీ సోమయ్యగారు సుప్రసిద్ధ న్యాయవాదిగాను, మద్రాసు హైకోర్టు న్యాయమూర్తిగాను గడించిన పేరు ప్రతిష్టలు బహు దొడ్డవి. వారి ఉదారహృదయం న్యాయదృష్టి, విచక్షణాయుత పరిజ్ఞానము సదా ప్రజాహితానికి తోడ్పడుతుండేవి. వీరు యీ నెల 8-వ తేదీన నిర్యాణము చెందారు.

శ్రీమతి సరస్వతీదేవి, శ్రీ సోమయ్యగార్ల నిర్యాణమునకు సంతాపముతో వారి కుటుంబాలకు మా సానుభూతిని తెలుపుతున్నాము.

---

# ఈశావాస్యోపనిషదు

పూజ్యపాద శ్రీ స్వామీ చిన్మయానందజీ.

## ఉపనిషదులు

(గతసంచిక తరువాయి)

---

ఈ శ్రేష్ఠమైన ఉపనిషదునందలి ప్రథమ శ్లోకమున ఒక చిన్న వేదాంత గ్రంథము, పరిపూర్ణ సత్య స్వరూపుని నిర్ణయ సిద్ధాంతములతో ఏర్పడియున్నది. ఆ సత్య స్వరూపుని తెలుసుకొనగల పద్ధతి వివరణములును, జీవిత విలువయొక్క చక్కని విమర్శయున్న, పరిపూర్ణ సత్య పదవిని గాంచిన మహా పురుషుడు అటు పిమ్మట తన దైనిక జీవితమును ఎట్లు నడుపుకొనునో తెలుపబడియున్నది.

ఈ భావములు ప్రతి యొక్కటియు ఒక్కొక్క శాస్త్ర సమన్విత గ్రంథరాజముగా యున్నను, ఇచ్చట చిన్న చిన్న పదములలో శ్లోకమున ఒక్కొక్క పాదముగ ఒక్కొక్క భావము నిపుణముగా అమర్చబడియున్నవి. ఇట్టి ఈ నాలుగు పాదములుగల శ్లోకమున నాలుగు వేదాంత సిద్ధాంతములు, అర్థగంభీర, భావసూచక వాక్యములచే వివరింపబడియున్నది.

ఈ శ్లోకము జ్ఞాన మార్గము లేక సన్న్యాస మార్గమును నమ్ము వారికొరకు తెలుపబడియున్నది. రెండవ శ్లోకమున కర్మ సిద్ధాంతమును, ఇందుకువిరుద్ధ మనో భావములుకలవారి ఉపయోగముకొరకు తెలుపబడుచున్నది.

ఇది అమృత స్వరూప, శాశ్వత తర్క సమశ్యగానున్నది. మానవుని నిర్మాణము ననుసరించి, ఈ గొప్ప సమశ్య వివిధకాలములలో, చరిత్రయందు వివిధ బలాబలములతో సాగుచునే యున్నది. ఒక అలల వరుస ప్రవహించినట్లు ఇవి కలుగుచు మానవ సంఘమును తన స్వాధీనమున యుంచుకొనుచున్నది. చరిత్రయందు ఒక కాలమున మానవులు పూర్ణ జ్ఞానమును లేక సన్న్యాస జీవితమును తలపెట్టి, ప్రోత్సహించి జీవించుచున్నారు. దీని వెనుకనే మరియొక అల దీనిని మ్రింగునట్లుగా బయలుదేరి ఇట్టి ఏకాంత జీవితమును, ఆత్మ జ్ఞానమును తిరస్కరించి, బాహ్య విషయ పూరిత నాగరికతను నెలకొల్పి దేహ సౌఖ్యములను, విషయ లాభములను కోరుచున్నది. ఇది అంతయు చెమట, కృషి, వ్యవసాయము దేహ కష్టములతో కూడిన కాల నిర్మాణము.

ఈ ఈశా ఉపనిషదు ఇట్టి జ్ఞాన మార్గమును, కర్మ మార్గమును సమన్వయము చేయగల ప్రయత్నముగానున్నది.

కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతం
సమాః ।
ఏవం త్వయి నాన్యథేతోఽస్తి నకర్మ
లిప్యతే నరే ॥ ౨

ఈ ప్రపంచమున కర్మ చేయుచునే ఒకడు నూరేండ్లు జీవించకోరవలెను. ఇదియే చక్కని మార్గము. ఏలన, చక్కని మార్గము వేరులేదు. ఇట్టి గుణముగల మానవునికి కర్మ బంధము కలుగదు.

ముందు శ్లోకమున తెలిపిన గమ్యస్థానము శాశ్వత పరిపూర్ణపదవి. ఇది ఎల్లవారికి పొందదగిన పదవి. సందేహములేదు. ఇట్టి చక్కని తిన్నని మార్గమున అట్టి గొప్ప గమ్యస్థానమును చేరుయాత్ర సలుపవలెనన్న, యాత్రికులయొక్క మనసు బుద్ధియు పక్వము పొంది యుండవలెను. సామగ్రి తగ్గించుకొనవలెను. కాళ్ళు చేతులు సన్నగను బలముకలిగినవిగను యుండవలెను. అతడు పూర్తి వైరాగ్యముగలవాడుగను,

చక్కని విచక్షణాపరుడుగను, దృఢ మనసును తన యందు పూర్తి విశ్వాసముగలవాడుగను యుండవలెను. అట్టివాడు ఒక గొప్ప గురువుచే ఆశీర్వదింపబడి, శ్రుతుల వాక్యములు అందలి భావములు చక్కగ ఉపదేశింపబడినవాడుగ నుండవలెను.

మనమందరమును ఒకేరీతి గుణగణములు కలవారము కాము. మనలో కొంతమందికి, జ్ఞాన మార్గమున వెళ్ళగల యాత్రికులకు అనివార్యముగను, అవశ్యముగను యుండవలసిన గుణములు లోపించియున్నవి. మనలో సంపదకొరకు, బంధుత్వము కొరకు, కీర్తి కొరకు, ప్రతిష్టకొరకు పూర్తి ఆశలుంటున్నవి. ఇట్టివి అభావముగ నుండనది అరుదు. ఇట్టి ప్రపంచ జీవితమున అభిలాషగలవారు కర్మమార్గ జీవితమును శ్రద్ధతోను, విచక్షణతోను అనుసరించవలెనని శ్రుతి ఇక్కడ తెలుపుచున్నది.

మహాఋషులు ప్రపంచమువైపును అందు జరుగు వ్యవహారములవైపును దివ్యవైరాగ్యము గలిగియుండుటవల్ల, కాలరంగమందు చరిత్ర మరల మరల పునరుచ్చారణముగాంచుట చూచుచున్నారు. మనముకూడ చరిత్రను మమకారభావము త్యజించి విమర్శించినయెడల, మానవ చంచల జీవితములో సత్యనిరూపణ సిద్ధాంతములు తరచుగా ప్రకటమగుట గమనించగలము. జీవితమునందలి ఉన్నత, శాశ్వత విలువలను శూన్యముచేసి అవమానపరచినయెడల ఆ తరమువారు అధోగతి చెందుచున్నారు. వారి పునరుద్ధారణము వారియొక్క శ్రద్ధ, సామర్థ్యము, పట్టుదలను బట్టి, నూతన తరమువారు అవలంభింపగల మత ధర్మ వేదాంత విలువల ధారుఢ్యము, ఉన్నతమునుబట్టి అభివృద్ధి గాంచుచుండును.

ఇట్లు ఈ మహా ఋషులు జీవితమును దానియొక్క పరిసరములను సూక్ష్మముగ పరిశీలించి, వారియొక్క తీక్ష్ణ జ్ఞానమువల్ల, కర్మ, అకర్మ, వికర్మ వీటివల్ల కలుగు ఫలములను నిర్ణయించియున్నారు. వారి అభిప్రాయము ప్రకారము, అకర్మ-అనగా అంతరమున జరుగు తీవ్ర వ్యవహారములను దట్టమైన ముసుగుకప్పియుండుటవల్ల శారీరక వ్యవహారములే లేదను భావము తోచునట్టిది. - అదియే జ్ఞాన సన్యాస మార్గములలో వెదకు సాధకులకు, సర్వోత్కృష్టమైనది. దీనికి వ్యతిరిక్తముగా బాహ్యమునగాని, అంతరమునగాని వ్యవహారములు లేనిది వ్యాధి, సోమరితనము, మందత్వము. ఇక కర్మ అనునది బుద్ధి పూర్వముగ, శక్తివంతముగ నిర్దిష్టకోరికను పూర్తిచేయుటయో, లేక కార్యవ్యవహారమే తన జీవిత గమ్యస్థానమని వ్యవహరించుటయందే ఆనందము అనుభవించుచుండుటయో కర్మయనబడును.

ఒక మానవతరమువారు చరిత్రయందలి ఒక కాలభాగమున, జ్ఞానమార్గమును పై శ్లోకమున తెలుపురీతి అనుసరించు కోరికలేనివారైన యెడల వారు శక్తివంతముగను, బుద్ధి పూర్వకముగను కార్య క్రమమున జొరబడి, నెమ్మదిగా కర్మ మార్గమును అనుసరించవలెను అని శ్రుతి కర్తలు వక్కాణించుచున్నారు. ఇచ్చట ఈ రెండవ శ్లోకము, కర్మమార్గమును స్తుతించుచున్నది.

"కర్మ చేయుచునే మానవుడు నూరేండ్లు జీవించ కోరవలెను" అని ఋషి తెలుపుచున్నాడు. ముందటి శ్లోకమున సంపదయందు, సంతతియందు, కీర్తియందు ఆశలేనివారు మాత్రము ధ్యాన మార్గమును చక్కగ అనుసరించగలరని తెలుపబడియున్నది. కాని ఒక తరమున మానవులందరును విచక్షణ వైరాగ్యము కలిగియుండరు. యుండుట అసాధ్యము అని ఋషులకు తెలియును. చాల మంది జనులు తీక్ష్ణమును, బలవంతములైన కోరికలు కలిగియుందురు. కనుక జన్మాంతర విషయములను తెలుసుకొను మానసిక, వైజ్ఞానిక అభివృద్ధి వారికి యుండదు. వారి కొరకు ఈ అమర గురువు, యొక కార్య క్రమమును నిర్దేశించియున్నాడు. "ఇచ్చట కర్మ చేయుచునే" అను భావము చాల శక్తి స్వరూపముగా నున్నది. అనగా దాని అర్థము, మానవుడై జన్మించిన వెనుక కర్మ చేయుటే తప్ప వేరుగతి లేదు.

ఇట్లు ఉపనిషదులయందు చెమటకారి కృషిచేయుటకు గొప్ప గౌరవ స్థానము ఇవ్వబడినది. కృషికి

హిందూమత శ్రుతులయందు బహిరంగముగను, ధర్మన్యాయముగను గౌరవము చూపబడియున్నట్లు మరి ఏమతమునను కానరాదు. కైంకర్య పూరిత గౌరవ కృషియే మానవ మృగమునకు నిజమైన విజ్ఞానము, చక్కని క్రమశిక్షణ ఇవ్వగలిగియున్నది. మర్మము తెలిసినవారికి, కృషిచేయుట హానిసత్యము కాదు. వినుగు జనించునది కాదు. అది జీవితమునకు రుచి నివ్వగలిగియున్నది. కాని మానవరాశి ఒక తరమున సత్తువలేక, నీతి తప్పి, విపరీత భావములచేత మార్గము తొలగి, సర్వనాశము చెందు సమయములలో క్రిందికి దొర్లుచు "ఎక్కువ కూలి, తక్కువకృషి" కావలెనని కేకలు వేయగలరు. వారికి "పని పూజ్యము - పూర్తి లాభము" అను స్థితి కలిగినను, వారియొక్క దూరాశ శమించుటలేదు. మానవుడు సోమరితనమున పొర్లాడుచుండుటకు జన్మించియుండలేదు. ప్రకృతి అతని తామస గుణమును ఖండించి, కర్మమార్గమున నీతియో, అవనీతియో కర్మముచేయ పురికొల్పును. తుదకు అతనిని పరిపక్వదశకు తేగలిగి, "కర్మమున అకర్మమును" అనుభవించు ఆనంద స్థితికి, అనగా పైన తెలిపిన అకర్మమార్గమున చేర్చగలుగుచుండును.

యథారీతి ప్రసంగాంతరమున ముచ్చట మొదలుపెట్టితిని. కాని నేటి దేశకాల పరిస్థితిని తలచి ఇట్టి ప్రసంగము వృథాయని తలచను. విశ్వవిద్యాలయా యంత్రములలో పక్వము కాలేక జారిపడిన వారినెల్ల పండితులుగా తయారుచేయుట యజ్ఞశాల కార్యము కాదు. కాని అట్టి వారిలో అన్ని గుణగణములు సమత్వముతో చేరియుండుటకై ప్రయత్నించ ఇందు చేరియున్నారు. అట్టి నిర్మల సద్గుణ సమ్మేళనమే "హిందూమత ధర్మము" అను పదమునకు సరియగు అర్థము.

హీన పదవి గాంచియుండు హిందూ మతమున వేదాంతమువల్ల జీవిత సమశ్యను తప్పించుకొను విధానము దొరకుచున్నదని తెలుపబడుచున్నది. ఇది మన అజ్ఞాన నమ్మకము. దీనికి మన అసంపూర్ణ పండితుల ఉపన్యాసములు బలము నిచ్చుచున్నది. చిలుకవలె పురాణకథలు వల్లించుట మహా గొప్ప కార్యమని, విద్యకు, జ్ఞానమునకు, పాండిత్యమునకు గుర్తని తెలుపుచున్నాము. ఇట్టి దురభిప్రాయములవల్ల మనము నెమ్మతిగా అధోగతికి వచ్చుచున్నాము. వేదాంత మన నేమియో తెలియలేకున్నాము. అంతియేగాక వేదాంతమువైపు మనకుగల దురభిప్రాయములే న్యాయ తీర్మానములని మానమువిడిచి ప్రకటించుచున్నాము. ఇదిగో! వేదాంత మూల గ్రంథమున తొలి ఉపనిషదునందు రెండవ శ్లోకరూపమున ప్రకటింపబడిన అభిప్రాయమును గమనింపుడు "ఎవడైతే ఆత్మ నిగ్రహముతో ఉన్నత సన్యాస మార్గమును జీవించ శక్తి లేకుండునో, అట్టివాడు తప్పనిసరి, తీవ్ర వ్యవహార సాహసముతో తనయొక్క కోరికలనంతయు పూర్తిగ ననుభవింప ప్రయత్నించుటకై చెమటకారునట్లు కృషిచేయవలెను. ఇట్టి రుచికర జీవితమును గడుపుచు నూరు వత్సరములు జీవించు యోగ్యత సంపాదించుకొనవలెను."

"ఇందువల్ల ఇట్టి జీవితము యోగ్యముగా యుండగలదు కాని ఇంతకుమించి వేరు విధానమున కాజాలదు" అని ఉపనిషదు పునరుచ్చారణము చేయుచున్నది. ఇదియే మార్గము. ఇతర సాధ్యమైనవి గాని, కోరదగినవిగాని ఏదియు లేదు అని గ్రంథము రద్దుచేయుచున్నది. ఇట్లు జీవితమందు పూర్ణముగా మగ్నమై దినదిన సమశ్యలన్నిటిని ఆశతో, ఆతురతతో ఎదుర్కొన ప్రయత్నించుచు, ప్రతియొక్క మార్పునందును, నిర్మల సత్యమార్గమున వ్యవహరించుచు, అట్టి ఉన్నత జీవితాశయమే తన ధర్మమని వ్యవహరించు మానవునికి, కర్మములు బంధకారములు కాజాలవు.

(సశేషము)

# పల్నాటి వీర చరిత్ర

శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు

---

పల్నాటి వీర చరిత్ర మంజరీ ద్విపదలో రచించబడ్డ జానపదగేయం. దీనిలోని కథ చారిత్రకం. కాబట్టి దీనికి ఆంధ్రదేశ చరిత్రలో స్థానం ఏర్పడింది.

ఈ గేయాన్ని గుంటూరి సీమలో పిచ్చుకకుంట్లు * అను జాతివారు పాడుతు జీవనోపాధిని సంపాదించుకొంటారు.

పల్నాటి వాసులైన అక్కిరాజు ఉమాకాంతంగారు శ్రమపడి పల్నాటి వీరచరిత్రను సంపాదించి, ఇది శ్రీ నాథ మహాకవి రచన అని ధ్రువపరుస్తు, తొలిసారిగా 1911లో అచ్చువేసేరు. గ్రంథపీఠికలో ఈ కథతాలూకు తాటాకు ప్రతులు నాలుగు దొరికేయనీ, అందులో ఒక్కటే సమగ్రంగా ఉందనీ తెలియజేసేరు. వీటిలో శ్రీనాథకవి పేరు ఎన్నిటిలో ఉందో చెప్పలేదు. పల్నాటిలో పిచ్చుకకుంట్లు ఈ వీరచరిత్రను పాడతారని ఉమాకాంతంగారు అన్నారు కాని వారి పాట, ఈ గ్రంథమూ ఒక్కటో లేక ఎట్టి భేదాలున్నాయో చెప్పలేదు.

పల్నాటి వీరచరిత్రను వ్రాసిన కవులు పలువురున్నారు. 1. శ్రీనాథుడు. 2. ముదిగొండ వీరభద్రయకవి - ఇతను క్రీ. శ. 1862లో పద్యాలలో రచించేడు. 3. మల్లయ్య 4. ♦ కొండయ్య. ఈ కవులందరిలోను శ్రీనాథుడు ప్రాచీనుడు.

ఈ గేయంలో పల్నాటి వీర కథ అంతా లేదు. పల్నాటి వీర యుద్ధం బాల చంద్రయుద్ధంతో సహా మాత్రమే ఉంది. కాబట్టి దీనికి పల్నాటి వీరచరిత్ర అనుపేరు చక్కగా సరిపోతుంది.

శ్రీనాథుని ఉద్దేశం పల్నాటి వీరచరిత్ర అంతా రచించడం కాదని చెప్పవచ్చు. అతను ఆ కథలో కొంచెం భాగము తీసుకొన్నాడు. దానిలోని ఘటనల జాబితాను ఇట్లు తెలియజేసేడు.

నరనాథ సింహంబు నలగామరాజు,
మహిత చరిత్రుడు మలిదేవరాజు,
ధారుణి నేలుచు తమలోన పోరి
కార్యమ పూడి శ్రీ కదనంబునందు
నరపాల చంద్రుండు నలగాముతోక
పంపిన బాలుండు బహు విక్రముండు,
తోరంపు గజముల, తురగచయంబు
మన్నీల బలములు మహిత శౌర్యమున
చెదరి పారంగ చీకాకు చేసి
నలగాము తమ్ముడు నరసింగు నెదిరి,

---

* పిచ్చుకకుంట్లు ఇతర చోట్లకూడ ఉన్నారు. ఉత్తర ఆర్కాటు జిల్లాలోని గుడియాత్తం తాలూకాకుకూడ వీరు వస్తూంటారు. వీరి నివాసం ఈచుట్టుపట్లే ఉండవచ్చు. ఇచ్చటే కోటవిట్ట అను గ్రామంలో ఒక పిచ్చుకకుంటు, గ్రామస్థులను నాటకాలను (యక్షగానాలను) నేర్పుతాడు.

♦ పల్నాటి వీర చరిత్ర పీఠికలో 36, 50, 86వ పుటలు. మల్లయ్య ఒకద్విపద కావ్యమును, కొండయ్య వేరొక ద్విపద కావ్యమును రచించిరి.

మర్దించి రణమున మడిసిన విధము
ప్రచురింతు వీనుల పండువుగాను

(పుట 1)

గ్రంథాంత మందు —

బాలుని విక్రమ ప్రావీణ్యమెల్ల
జనులకు వివరించె సక్తితో దీని

(పుట 120)

అన్నాడు.

కాబట్టి ఈ కథ హఠాత్తుగా అలరాజు చావుతో మొదలు పెట్టింది. దీనికి పూర్వకథ ఎంతో ఉందని చెప్పవచ్చు. శ్రీనాథకవి గ్రంథ పీఠికలో, చెన్న కేశవస్వామి తనకు కలలోకి వచ్చి పల్నాటి వీర భాగవతాన్ని వ్రాయమన్నాడని, అందుచేత తాను పల్నాటి వీరుల చరిత్రను వ్రాస్తున్నానని తెలియ జేసేడు. కాబట్టి పూర్తి కథకు పల్నాటి వీర భాగవతమను పేరు ఉండేదని చెప్పవచ్చు. మహా భారతకథకు, ఈ వీరకథకు ఉండే పోలికలను బట్టి దీనికి పల్నాటి భారతమనికూడ పేరు ఉంది.

## కవి ఎవరు?

పల్నాటి వీర చరిత్రలో శ్రీనాథుడి ‡ పేరు కథా ప్రారంభంలోనె ఇలా ఉంది —

సంగీత సాహిత్య చాతుర్య కవిత
చెప్ప నేర్చినవాడ, చెలగి మాచెర్ల
చెన్న కేశవ పాద సేవారతుండ,
వలను భారద్వాజ వంశ వర్ధనుడ,
కవి సార్వభౌముడ, ఘనత గన్నట్టి
శ్రీనాథుడను వాడ, శివభక్తిపరుడ,
మంజరీ ద్విపదగా మన్నించి నేను

రచిస్తున్నానని తెలియ జేసేడు. అట్లే గ్రంథాంత మందుకూడ 'ఘనుడైన శ్రీనాథకవి రాజ రాజు' రచించేడని చెప్పుకొన్నాడు. శృంగార నైషధాది గ్రంథాలను రచించిన శ్రీనాథుడు భారద్వాజ గోత్రుడు, కవిసార్వభౌముడు, శివభక్తి పరుడు. కాబట్టి ఈ ఇద్దరు ఒక్కరే అని అనిపిస్తుంది. కాని ఈ గ్రంథం శ్రీనాథుని రచన కాదు అనిపించే లక్ష ణాలుకూడ కొన్ని కనబడతాయి. శ్రీనాథకవి పోను పోను తన గ్రంథ పీఠికలనే ఉన్న ఆశ్వాసాలగా తయారు చేసేడు. అటువంటి లక్షణం ఈ వీరకథలో లేదు. అంతకు పూర్వమున్న ఘన సంస్కృతాంధ్ర కవుల జాబితాలను తన గ్రంథాలలో ఇచ్చేవాడు. అట్టిది ఈ గ్రంథంలో లేదు. ఇంకా, అతను అది వరకే తాను రచించిన పుస్తకాల పట్టీని వల్లించే వాడు. ఆ లక్షణంగూడ ఈ గేయంలో లేదు. ఇట్టి భేదాలకు కారణమేమి? ప్రబంధ రచనా పద్ధతివేరు, జానపదగేయ రచనా పద్ధతివేరు. దీని రచనలో జానపదగేయ కవుల పద్ధతులను అనుసరించడంవల్ల పైభేదాలు వచ్చేయి. మరొకగడ్డు సమస్య ఏమంటే- శ్రీనాథుడి పలుకుబళ్లు ఈ గేయ కావ్యంలో కన బడవు. దీనికి కూడ ఒక్కటే సమాధానం. జానపద గేయాలకు ప్రత్యేక శైలి, భాష, సాంప్రదాయా లున్నాయి. కాబట్టి ఈ కథను పరిశీలించేటప్పుడు దీనిలో జంగం కథా లక్షణాలు పాటించ బడ్డాయా లేదా అని చూడవలసిందే కాని మరొక మార్గంలేదు. నాగపూడి కుప్పుసామయ్యగారు పల్నాటి వీర చరిత్రలోని వ్యాకరణ దోషాలను చూపించి † ఇది శ్రీనాథకృతం కాదన్నారు. జంగంకథా రచనలో భాషకి ఎంతో స్వేచ్ఛఉంది. కాబట్టి అవి వ్యాకరణ దోషాలు కావు.

శ్రీనాథకవి ఈ మంజరీగేయాన్ని రచించలేదని మనం సందేహించ నక్కరలేదు. ఎందుచేతంటే,

‡ శ్రీనాథుడను పేరు తెలుగు దేశంలో అంతకు పూర్వంనుంచి వాడుకలో ఉంది. కాకతీయ ప్రతాపరుద్రుడు (క్రీ. శ. 1295 - 1326), కొచ్చెర్ల కోట ప్రాంతంలో ఉండే అడవిని నరకించేడు. ఇది ధూపాటి సీమ. ఈ ప్రాంతాన్ని అనుమకొండ వాసియైన శ్రీనాథరాజు అనువానికి ఇచ్చేడు (చూ. చిలు కూరి వీరభద్రరావుగారి కాకతీయాంధ్ర రాజయుగ చరిత్ర, పుట 571)

† ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక 6 వ సంపుటం 5 వ సంచిక 226 వ పుట.

క్రీ. శ. 1700 ప్రాంతంవాడైన గంగుల పినయెల్లన్న తాను కాటమరాజు కథను రచించబోతూ 'శ్రీనాథుని వచనపద్ధతి'ని రాస్తానని ప్రతిజ్ఞచేసేడు. దీనిని బట్టి శ్రీనాథుని కర్తృత్వం బలపడుతూంది.

## రచనాకాలం

శ్రీనాథుడు తాను కవిసార్వభౌముడయేకే ఈ గ్రంథాన్ని రచించినట్లుగా చెప్పుకొన్నాడు. అది అట్లుంచి దీనిలో పలి సాక్ష్యాలేమేనా ఉన్నాయేమో చూద్దాం.

తిక్కన (క్రీ శ. 1200 - 1257) భారతంలోని-

మాధవా! మన రథంబును మరలనిమ్ము
బ్రతికియుండిన సుఖములు బడయవచ్చు

అను వాక్యాలు ఇంచుమించుగా అట్లే పల్నాటి వీరచరిత్రలో—

పార్థుడంతటివాడు ప్రథమ రంగమున
కర్ణుని రాకడగని భీతినొంది
బ్రతికితే సుఖములు బడయంగవచ్చు
అరదంబు మరలింపుమయ్య శ్రీ కృష్ణ!

అని ఉన్నాయి.

శ్రీనాథుని కాలంలోనె ఆంధ్ర మహా భాగవత రచన జరిగిఉన్నా, ఇంకా దానికి జనత కలగక పోవడంచేత కాబోలు భాగవతాన్ని చదవమని ఐతమ్మ తన కుమారుడైన బాలచంద్రుడితో ఒక్క ముక్కలో చెప్పి, భారతాన్ని గురించి చాల వివరంగా చెప్పింది. (పుట 32) అంతేకాకుండ తిక్కన అనువదించకుండా విడిచిపెట్టిన భగవద్గీతను గురించి కూడ వివరంగా చెప్పింది. భగవద్గీతను మూలంలో చదవడమె ఆచారమని చెప్పవచ్చు. ఇప్పటికిని ముసలమ్మలు అలాగేకదా చేస్తున్నారు. ఈ గ్రంథంలో క్రీ. శ. 1450 ప్రాంతపు అంశాలేమేనా ఉన్నాయేమో పరిశోధకులు పరిశీలించాలి.

శ్రీనాథుడు సముద్రతీరాన ఉన్న కొల్పట్టణవాసి. కాని పల్నాటి వీరచరిత్రను చూస్తే అతను కొంత కాలం పల్నాటిలో ఉండిపోయినట్లు తోస్తుంది. ఈ కవి జీవితం చాల ఎగుడు, దిగుడులుగా ఉంది. అతను చివరికాలంలో ఎన్నో బాధలు పడ్డాడని అతని చాటువులనుంచి గ్రహించవచ్చు. అతను పల్నాటి జీవితాన్ని నిరసిస్తూ చాటువులు రచించేడు. కాని భగవంతుడు తిననన్న నోటే తినిపిస్తాడు అన్న సామెత ప్రకారం అతను ఇష్టపడని పల్నాడే సంప్రాప్తమయింది.

ఈ కవి ఈ గ్రంథాన్ని ఏవయస్సులో రచించేడు? శ్రీనాథుడు తాను కవిరాజ రాజుననీ, కవిసార్వభౌముణ్ణి అని చెప్పుకొన్నాడు. కవిసార్వభౌముడు అను బిరుదు అతనికి కుమారుగా అరవయో ఏటగాని లభించలేదు. కాబట్టి ఈ గ్రంథాన్ని అరవై ఏళ్ల వయస్సు దాటిన తర్వాతే వ్రాసేడని చెప్పవచ్చు. కాబట్టి ఇది క్రీ. శ. 1450 ప్రాంతపు రచన కావచ్చు.

## రచనావిధానం

ఆంధ్ర వాఙ్మయంలో కొన్ని కొత్త దోవలను ఏర్పరచినవాడు శ్రీనాథకవి. వాటిలో కొన్ని మంచివి, కొన్ని చెడ్డవికూడ ఉన్నాయి.

ఒక నాయకుణ్ణి గురించి వ్రాయవలసి వచ్చినప్పుడు అతని పుట్టుక దగ్గరనుంచి మరణందాక రాయనక్కర లేదు. అతని జీవితంలోని ముఖ్య ఘట్టాలను మాత్రమె తీసుకొని రచించవచ్చు అను కొత్త పద్ధతిని శ్రీనాథుడు ఏర్పరిచేడు. శృంగారనైషధంలో నలునికథ మొదటినుంచి చివరిదాక గాక అతని శృంగార ఘట్టంతో ముగించేడు. ఆ తర్వాతి ప్రబంధ కవులకు ఈ పద్ధతి ఒరవడి అయింది. ఏ రాజు కథను చిత్రించినా, వారు వివాహంతో ముగించేవారు.

అట్లు శ్రీనాథుడు నూతన విధానంయొక్క ఆకర్షణను ఎరిగినవాడు. కాబట్టి జంగంకథా రచనలో

[1339 పేజీ చూడుడు]

# గోవత్సము - కావ్యసమీక్ష

కవిశేఖర శ్రీ విశ్వనాథ నరసింహము ఎం. ఏ.



శ్రీ పువ్వాడ శేషగిరిరావుగారు రచించిన గోవత్సమను చిన్ని కావ్యము నామూలాగ్రముగాఁ జదివినంత నుదయించిన భావ విశేషంబుల నిందు పొందుపరచుచున్నాడ. ఈ కావ్యమునందు ప్రాచీనాంధ్ర కావ్యలక్షణంబులు నవీన సారస్వత దృష్టితోడ పొత్తుగలిసి మిక్కిలి మనోహరములైనవి.

"ప్రఖ్యాతంబన మిశ్రబంధ మన నుత్పాద్యంబనంగాఁద్రిధా వ్యాఖ్యాతంబగు" కథావస్తువులలో మూఁడవదియగు నుత్పాద్యమగు నితి వృత్తమును కృతికర్త స్వీకరించెనని తెలియనగును. గోవత్సమను శీర్షిక వినినంతనే చతుష్పాదయుతంబగునని తోఁచునటులే యీ కావ్యము నాల్గు పాదములుగా విభజింపఁబడినది. "శ్రీ కిరీట ప్రభా శ్రీలలో" అను కావ్యారంభ మందలి శ్రీ కారము పూర్వలాక్షణిక సమ్మతమని విశదమగును. వేదముల కోంకారమాదియగునట్లు కావ్యములకు శ్రీ కారమాదియందున్న సర్వశుభప్రదంబగునని ఆంధ్రలాక్షణికులు పేర్కొని యున్నారు.

ఇందు మొదటి పాదమున నొక లేఁగదూడ గోమాతనుండి తప్పిపోయి పరిభ్రమించుచుండ సుకవితా జీవనానంద సుందరుండగు కవీంద్రుఁడు తిలకించి యీవాహ ప్రపంచమున పలుతలంపులు మొలతేర వాకొనుట హృద్యముగానున్నది. అందు,

"రాజ్యమే లేని రాజు సామ్రాట్టు లేని
యవని సతి లేని పురుషుఁడు ధవుఁడు లేని
వనిత ధరనున్న నుందురు జనని లేక
తనయుఁడాత్మజుఁడు లేని తల్లి లేదు"

అను సత్య సూక్తులు కవీంద్రుఁడు వెల్లడించును.

అంత చీఁకటి పట్టుకోక రజనీలలామ కయినేసినంత ప్రేమపాశగణ బందీభూత చేతస్కుఁడైన కవి దూడ నెత్తికొని యావుంజేర్చ తత్తరమున నెల్లవారలఁ బృచ్ఛించుచుండుట రసమయమగు ఘట్టము.

తరువాత మాతృహీనుల లఘుత్వము నెంచి

"చులకన జలరుహ తంతువు
చులకన తృణకణము దూది చులకన
సుమ్మీ
ఇలనెగయు ధూళి చులకన
చులకన మఱి తల్లి లేని సుతుఁడు
కుమారా"

అని నుడివిన మాటలు నూటిగా చిత్తమును హత్తుకొనుచున్నవి.

ద్వితీయపాదమున నొడలెల్ల బంగారు తొడవుల తొడుగుతో నొప్పు మూఁడు నాల్గేండ్ల బాలుఁడు దారి తప్పిన యడలుతో తడబడుచుండ, దిగ్దంతులం బోలిన వృషభద్వయంబు వాని సమీపించు తఱి యజ్ఞహవిస్స్వధాపవిత్ర హస్తమున బ్రాహ్మణ ప్రవరుఁడా బుడుతని సాహస సంభ్రమంబుల సురక్షితు నిగాజేయును. కార్యాతురుఁడగుట నా పండిత ప్రవరుఁడా బిడ్డగాపాడుభారము కవీంద్రునిపైవైచును. కవీంద్రుఁ డర్భకు నెంత లాలించినను ఎన్ని విధముల నూరడించినను ఎంత బుజ్జగించినను తల్లిని గాంచకుండుట కాబాలుఁడు బెంగపడెను. ఈ సందర్భమునందలి "కన్నతల్లికి సాటి స్వర్గమ్ము గలదె" అను గీతపాదము "జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపిగరీయసీ" యను సూక్తుల స్ఫురింపఁజేయును.

తృతీయ పాదమున బుడుతని కొఱకడలుగుడుచు తలిదండ్రుల యన్వేషణము మిగుల సహజముగా

నొప్పులు గులుకుచున్నది. ఆత్మజాన్వేషణార్థ ప్రయాణయగు జనని ప్రచురితాండజజాల కిచకిచారవములోఁదన కుమారుని తొక్కుపల్కుల గ్రహించుట మిగుల సొగసుగులుకుచున్నది. పక్కికూనల కిచకిచధ్వను లర్థరహితములయ్యు మనోహరముగా నుండునటులే పసిపాపల అర్థరహితాలాపంబులును శ్రోత్రపేయములనుట గ్రహింపనగును.

చతుర్థపాదంబున నంబారావమువిన్న వత్సమును అంబారావము విన్న నిద్రిత సుతుండును అల్లనలేచుటయును తటస్థింప గొల్లనితోగూడ పాఠకులుకూడ కవీంద్రున కంజలి ఘటింతురు.

ఇకాౄవ్యంబున కవీంద్రుని పాత్ర హృదయంగమము. కోమల మానసుఁడైన కవి లేఁగదూడను బుడుతని ఆర్ద్రహృదయముతో సాకుట విచిత్ర వర్ణనాంశంబుల సహజశోభావిలాసంబుల నలరారుచున్నది. ఇందలి పవిత్రప్రేమ ప్రాతవడిన యువతీ యువకుల కాముక విలాస విభ్రమంబులకు దూరమై మిగుల సొగసుగా వర్ణింపఁబడినది. పండితునికంటె కవి హృదయము సున్నితమను విషయము వ్యంగ్యముగా సూచింపఁబడినది. సన్నివేశముల కనువైన మృదుమధుర వచోగుంభనమ్ములతో "విరిసిన చుక్కలంబరపు వీధులఁదోరణ" గట్టుట, చీఁకటి పట్టుకోక కయిసేసిన రజనీలలామ, తపతపా యెగదన్ను గోవు నోరునున్ వాయియు లేని యా చిఱుతప్రాయపుఁ గుఱ్ఱ మన్నగునవి తూలికా రచిత చిత్రములవలె పాఠకుల కన్నులగట్టి యానంద మొదవించుచున్నవి.

ఇట్టి సుగుణము లనేకములీ చిన్ని కావ్యమునఁ జూఁపట్టుట నియ్యది నవ్యసాహిత్యమున విశిష్ట స్థానము వహించునని మనవిచేయుచున్నాను.

---

# హొటల్లో!

భోంచెయ్యడానికి ఒకాయన హోటల్లోకి వచ్చి చక్కగా అమర్చబడ్డ బల్ల దగ్గర కూచున్నాడు. సెర్వర్ ఆయన్ని చూశాక అక్కడికి వచ్చి కార్డుని ఆయన ముందు నుంచి "రూపాయన్నర భోజనం కావాలా!" అని ప్రశ్నించాడు.

ఆయన కార్డుని ఎగాదిగా చూస్తూ కొంచెంసేపు ఆలోచించి "ఆ రెండిట్లో భేదం ఏముంది?" అని అడిగాడు

సెర్వర్ కాలాంతకుడు. అర్థరూపాయి మాత్రమేనండి" అని నవ్వుతూ సూటిగా జవాబునిచ్చాడు.

జేబు దొంగ హోటల్లో ఒకాయన గదిలోకి ప్రవేసించి తనపని చూసుకొంటున్నాడు. ఆ సమయానే ఆయనా తలుపు గభాలున తెరచి లోనికి వచ్చాడు.

ఆయన్ని చూశాక "క్షమించాలి. మీరింత తొందరగా వస్తారని అనుకోలేదండి" అంటు దొంగ అక్కడినుంచి గబగబ తప్పుకోబోయాడు.

డాక్టర్ వి. యస్. శర్మ

---

# కూలిపిల్ల

శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తి

చిఱుగజ్జియల మ్రోతచెలఁగ గొఱ్ఱియపిల్ల
  అనుఁగుబిడ్డ విధాన ననుసరింప
చవులూరుకమ్మని చల్దియన్నపుమూట
  వామ భుజమ్మున వఱలుచుండ
ఊలుకుచ్చులతోడ నొప్పు కులుకుజోళ్ళు
  మృదుపదద్వయమునఁ బొదలుచుండ
పొలుపారు నిత్తడి పొన్నుల కొడవళ్ళు
  దక్షిణ హస్తానఁ దళుకులీన
పండి తలలు వంచిన జొన్నపంటచేను
గోయఁగా నేఁగుచున్న ఓ కూలిపిల్ల!
కూర్మి చెల్లెల!! రమ్ము! కైకొమ్ము! నాదు
మంగళశీర్వచః పుష్పమాలికలను.

పొలముల దాపునం గలుగు భూమిరు
  హమ్ములపై వసించు ప
క్షుల కలనాదమే శ్రుతిగ శ్రోత్ర సుఖ
  మ్ముగఁ బల్లెపాటలన్
గులుకుచుఁ బాడుచుం బయిరు గోసెదు
  నమ్మధుర క్షణమ్ములన్
బులకిత దేహవయ్యెదో! ప్రమోద
  మహాంబుధిఁ దేలియాడెదో!

ప్రొద్దునఁ జద్దిబువ్వ తినిపోయిన దాది
  శ్రమించి స్రుక్కుటం
బెద్దయు రేఁగు నాకలి శమింపఁగఁ జేసి
  కొనం బ్రతీచికిన్
బ్రొద్దిసుమంత వ్రాలఁగనె మాటలువిప్పి
  సఖీ జనమ్ముతో
సుద్దులు చెప్పుకొంచుఁ దినుచున్ శ్రమ
  మించుక తీర్చికొందువా?

అరుణుఁడు మాతృనంచలమునందు నొకిం
  చుక విశ్రమింపఁగా
నరిగెడు వేళ లేఁగలకునై యొక మోపెఁడు
  పచ్చగడ్డితో
బరుగున నింటికిన్ మరలివచ్చెదు నీదు
  నుదార మూర్తిలో
నిరుపమమున్ మనోజ్ఞమును నిర్మలమౌ
  నొక శోభ తోచెడిన్

శ్రమపడి స్వేదబిందువులు రాల్చి జగమ్ముల
  కెల్ల నన్నపా
నముల నొసంగు కర్షక జనమ్ముల కష్ట
  సుఖాలలోన భా
గముఁగొని కాయకష్టమును గౌరవ
  హేతువుగాఁ దలంచు పు
ణ్యమతివి, అన్నదాన సవనం బొన
  రించెదు సోమిదమ్మవున్

అబలవయ్యు స్వతంత్రతా స్వావలంబ
నములఁ గాంక్షించి నిజబంధనములఁ ద్రెంచి
పురుషులనుగూడి కృషిచేయు పూజ్యచరిత!
ఉవిదవెటుకాదు ? నీవు మానవివి నేఁడు
నారీ సుందర హృదయ
ద్వారము విశ్వప్రజాహితము మనసారన్
గోరి తెఱచితివ ? తుచ్ఛ శ
రీర కవచమూడ్చి సోదరీ। క్షేమకరీ !

పురుషులతోడఁగూడి సతమున్ దిరు
గాడుచునున్నగాని యే
తరుణమునందు నీదు నెడఁదన్ దలయెత్తవు
దుష్టభావముల్
సరస గుణాలవాల ! బుధసన్నుత నిస్తుల
సాధుశీల!! అ
బ్బుర మగునమ్మ !! తావక సముజ్జ్వల
శీల కళా విభూతికిన్.



కాలక్షేపం:

# నల్లులండోయ్ - నల్లులు!

శ్రీ పణతుల రామచంద్రయ్య,



"శివుడద్రిని శయనించుట,
రవి చంద్రులు మింటనుంట,
రాజీవాక్షుం
డవిరళముగ శేషునిపై
బవళించుట నల్లిబాధ పడలేక జుమీ"

మహామహా కొమ్ములు తిరిగిన శివుడూ, సూర్య చంద్రులూ, నారాయణుడూ అంతటివాళ్ళే నల్లిబాధ పడలేక - ఒకరు కొండమీదా, ఇద్దరూ ఆకాశంలో, మిగతా ఒక్కరు శేషుని మీదా నెలవు లేర్పరచుకున్నారట.

నిజమే. మానవుడి ఆరోగ్యానికి ఉపద్రవమయిన ప్రముఖ సూక్ష్మ జీవుల కోవకు నల్లులు కూడా చెందుతాయి. శరదృతువులో వృక్ష జాలమంతా పచ్చగా కలకలలాడుతూవుంటే, ఆ 'కలకల'లకు అనులోమానుపాతంలో దోమలు ప్రభవించి రాత్రిళ్ళు నిద్ర పోనీకుండా నానాయాతన పెడతాయి. అలాగే, సన్నజిల్లేడు దూదితో, కాశీపట్టుతో ఎంతో మెత్తగా పరుపులూ, దిండ్లూ కుట్టించి, వాటి కానుకుని తన్మయత్వం పొందుదామనుకుంటే, ఆ 'మెత్త'కు ప్రపోర్షనేట్‌గా ఆ పరుపుల్లో నల్లులు కాపురం చేస్తో కడుపులో చల్ల కదలకుండా, వానికానుకున్న మానవులరక్తపానం చేస్తుంటాయి. అందుకే కాబోలు - విష్ణు మహేశ్వర సూర్య చంద్రులు వీటిబాధకు తట్టుకోలేక, తలో ఒక చోట కుదురుకుంది!

ఈవిధంగా యీ నలుగురూ - అంటే రామాకాంతుడూ, ఉమాకాంతుడూ, ఉషాకాంతుడు, తారాకాంతుడూ_లలాఒక నెలవు చూచుకోవటంలో మరో విశేషంకూడా కలిసి వచ్చింది. వెండికొండ అంతా నిరంతర హిమాకరం కావటంవల్లనూ, వినువీధి అంతా ప్రాణులు మనటానికి సరైన వాతావరణం మృగ్యమయినందు వల్లనూ, శేషశయ్య చుట్టూ ఉన్న సముద్ర తరంగాలు ఉప్పు ఘాటు వెలార్చటం వల్లనూ ఆయా ప్రదేశాలలో నల్లులే కాకుండా దోమలుకూడా చేరవు. ఇలా "అద్రిని శయనించుట, మింటనుంట, అవిరళముగ శేషునిపై బవళించుట"లో వాళ్ళ బుర్రలు అమోఘంగా పనిచేశాయి.

అయితే ఇక్కడి వరకూ వచ్చాక కొంచెం ధర్మసందేహం కలగక మానదు. ఇంతా చేసింది కమలభవుడు. ఈయనా త్రిమూర్తుల బోర్డులో మెంబరే. (ఈయన మట్టుకు ఈయనకూడా నల్లి బాధ పడలేక, తరులతా గుల్మాదులచే ఆవృతమైన పాలరాతిమీద కూర్చున్నాడనుకోండి.) ఈయనగారు దూరాలోచన లేకుండా నల్లులను పుట్టించి, వానికి మానవరక్తం ఆహారముగా చేసితే తోటి సభ్యులిద్దరూ ఆవిధంగా చెరొక చోటకు వెళ్లిపోవలసిన అగత్యమెందుకు కలిగింది? అందులోనూ బ్రహ్మ నారాయణుడి పుత్రుడేనాయె! అలాంటప్పుడు ఇద్దరూ - శివుడూ - విష్ణువూ ఒకటై "ఇలా చేశావేమోయ్! సరిచెయ్యి" అనేస్తే బ్రహ్మ తన కృత్యాన్ని మార్చేసివుండును కదా! ఈ విషయంలో వీళ్ళ బుర్ర మందగించిందేం? చూస్తే, మత్కుణ పటు ప్రతాపఘాటికి భయపడి పరుగెత్తే

టప్పుడు - ఆమాత్రం ఆలోచించుకునేపాటి బుద్ధి అయినా వాళ్ళకు కలిగి వుండక పోవచ్చు. పైగా, సమయానికి ఏ పరాకున ఉండినాడో ఆ చతుర్ముఖుడు వీటికి మృదుహంసతూలికా తల్పాలలో ఉండేట్టు వరంకూడా రాసిపడేసి కూర్చున్నాడు !

నెత్తురు పీల్చి బాధించడంవరకే వూరుకోవు నల్లులు. మా మామయ్య ఎప్పుడయినా మా యింటికి వచ్చినప్పుడు ఖర్మకొద్దీ ఏ నల్లి అయినా కంటబడితే చాలు, "నేయి బోయ భగ్గున దరి కొన్న భీషణ హుతాశనకీలయనంగ లేచి," దాన్ని ఏ ఆయుధంతోనయినా చంపే వరకూ నిద్రపోడు. ఈయనకు నల్లులంటే ఇంత కసి ఏమిటా అని వాకబుచేస్తే అధికారరీత్యా తెలియవచ్చిందిది. ఓరోజు మామయ్య, వాళ్ళ ఆఫీసరుకి లీవ్ లెటరురాస్తూ, అందులో - వాళ్ళ మామగారికి త్రీవంగా టైఫాయిడ్ కాస్తోందనీ, పోయి చూచిరావటానికి ఓ వారంరోజులు సెలవు గ్రాంటు చేయమనీ కోరాడట. అలా రాసుకున్నవాడు దాన్ని ముందు పోస్టు చెయ్యక అట్టే పెట్టి పుట్టింట్లో ఉన్న భార్యకు జాబు వ్రాయ నారంభించాడట. అందులో, తను ఆఫీసరుకు మస్కాకొట్టి అబద్ధాలాడి సెలవు యిప్పించుకున్నాననీ, ఆరోజు ఎక్స్ప్రెస్సుకే వూరువస్తున్నాననీ ఆమెకు విశదీకరించాడట. ఇలా జాబు పూర్తి అయిందో లేదో సరిగ్గా ఆ ఇన్స్టంట్ లో నేవయ్యారంగా కుషన్ లో కూర్చుని ఆవులిస్తున్న ఆయనను, అంతవరకూ వేచివున్న నల్లి ఒకటి తొడమీద ముద్దెట్టుకుందట. ఆకాశవీధుల్లో విహరిస్తున్న మా మామయ్య ఒక్క ఊపుతో దభీమని ఈలోకానపడి, దిగ్భ్రాంతిపడి ఆ భ్రాంతిలో అత్తయ్యకు వ్రాసిన లేఖ ఆఫీసరుకూ, లీవ్ లెటరు అత్తయ్యకూ పోస్టుచేసేశాడట. ఇక తరువాత జరిగినదేమిటి ? సమాధానానికి వెండి తెరపై చూడవలసిందే ! అందుకే ఈనాటికీ ఎక్కడయినా నల్లి కనుపిస్తేచాలు, ఆయనకు — ఆనాడు ఆ కారణాన తను ఆఫీసరుగారిచేత బడసిన ఆశీర్వచనాలు జ్ఞప్తికి వచ్చి ఒళ్ళు జలదరిస్తుందట !

నల్లులవల్ల ఇలాంటివే చాల అవస్థలున్నాయి. చాల చోట్ల పెళ్ళి చూపుల కార్యక్రమం సాగేటప్పుడు - వాళ్ళకై ఏర్పాటుచేసిన ఆ అద్దెకుషన్లలో ఏ కొద్ది నల్లులయినా చేరివుండి ఆ వుడ్ బీ అల్లుడినీ, ఆయన పరివారాన్నీ పరామర్శిస్తే, వాళ్ళు (పెళ్ళికొడుకు కాదనుకోండి) - "బాబో, ఈ మామగారు వరక్రయంతోబాటు నల్లుల్నికూడా ప్రసాదిస్తాడు కాబోలు" అనుకుని, ఆ నెపంతో తిరిగి పోవడం లాంటివికూడా జరుగుతూ ఉంటాయి. కొందరికి శరీరం పైత్య ప్రకృతి కావటంవల్ల, నల్లి కరిస్తే, ఒళ్ళంతా పెద్ద పెద్ద దద్దుర్లువేలి మహా బాధ వేస్తుంది. 'కించిత్తు నల్లివల్ల మంచానికీ దెబ్బ' అన్నాడు సుమతికారుడు.

అయితే ఇంత ఉపద్రవమయిన నల్లులవల్లకూడా కొంచెం ప్రయోజనంలేకపోలేదు. ముఖ్యంగా సినిమా హాలువాళ్లకు నల్లులుచేసే ఉపకారం ఇంతింతా కాదు. చాలా థియేటర్లలో యజమానులు, తొమ్మిదణాల సీట్లలో నల్లుల్ని భారీ ప్రమాణంలో ఉంచుతారు. ఇందువల్ల వాటిబాధ పడలేక [మానవ మాత్రులు గనుక] ఆ సీట్లకువచ్చే ఆసామీలంతా ముప్పాతిక మంది పధ్నాలుగణాల టిక్కెట్టు కొనుక్కుంటారు. కాని దూరదృష్టిగల యజమానులు వాటిల్లోనూ కొద్దిగా మత్కుణ యుధాన్ని ప్రవేశపెట్టి ఉంచటం వల్ల చాలామంది రిజర్వ్డుకు పోతుంటారు. అందుకే ఇప్పుడు చాలా హాల్సులో రూపాయిన్నర టిక్కెట్లే ఎక్కువ పోతున్నాయి !

ఇంతెందుకూ ? నేను మొన్న స్కూలు ఫైనలు నుంచి బయటపడ్డది మత్కుణ సహాయంవల్లనేనని గుండెమీద చెయ్యివేసుకు చెప్పగలను. సెలవుల్లో రాత్రి పదివరకూ రాని నిద్ర, మాసపత్రికలు పట్టుకుంటే పదకొండువరకూ రాని నిద్ర, పరీక్షల్లో రాత్రి ఏడింటికి క్లాసుబుక్సు స్పృశిస్తే చాలు, ముంచుకొచ్చేది. మా పక్కింటి ఆచార్లుగారింట్లో నల్లులున్నాయి చూడండి - అవి నల్లులా అని అనుమానం

# ఉభయులా బాధ్యత వహించవలసినవారే

శ్రీమతి ఎకా హనుమాయమ్మగారు

మేఘాలు దట్టంగా పట్టినవి. పెద్ద పెద్ద ఉరుములు మధ్య మధ్య మెఱుపులు. ఉరుములంటే పద్మకు ఎంతో భయం. ఉరుము ఉరిమినప్పుడల్లా తన నెత్తిమీద పడుననే పద్మ తలంచును. పద్మ గది కిటికీవద్ద కుర్చీలో కూర్చొని దొడ్డివేపు చూస్తూఉంది. నిన్న, మొన్నా కురిసిన వానకు ఇంటిచుట్టూ మోకాలులోతు నీళ్లు నిలిచియున్నవి. ఆ నీటిలో గోంద్రు కప్పలు అరుస్తున్నవి. దొడ్డిలో నేలనల్లు కొన్న గుమ్మడితీగె ఆ నీటిపై తేలియాడు తున్నది. పచ్చగావిచ్చిన గుమ్మడిపూలు పద్మాలలాగా మెరుస్తూ ఆకాశంలో మేఘాలమధ్య తొంగి తొంగి చూచే చంద్రుడ్ని వెక్కిరించుచున్నవి. పద్మ కిటికీలోనుండి ఒక్కొక్క చింతగింజ ఆ గోంద్రు కప్పలు అరచు దిక్కునకు విసరుచూ తలార్చుకొంటున్నది. పద్మ తెల్లని పట్టుచీరకట్టుకొని సాధారణ భూషణములు ధరించియున్నది. చక్కని దేహచ్ఛాయతో పద్మ మెరిసిపోతూ విచారకరమైన మొగముతో ఆమె దీర్ఘముగా నేదియో నాలోచించుచున్నది. చేతిలోనున్న పుస్తకము తెఱచి దానిలోనున్న నొక కవరు తీసినది. ప్రేమగాదండామా లేదండామా అనుకొనుచు రెండుమూడుసార్లు ఆ జాబును చదువుకొని తలపంకించినది. ఆ జాబును ముక్కలు ముక్కలుగాచేసి కిటికీలోనుండి బయటకు పారవేసినది. ఇంక జీవించ గూడదు జీవించలేను. మూడు దినాల ముచ్చట తీరిపోయినది, అని అనుకొనుచు మంచముపై పవ్వళించి దుఃఖించుచున్నది. శాంతమ్మ గదిలోకొచ్చి "అమ్మా పండు కొన్నావా? తలార్చుకో, జలుబు చేస్తుంది" అంటూ దుఃఖిస్తున్న కూతుర్ని చూచింది. "అమ్మా, దుఃఖించుచున్నావా. మంచి రోజులు వస్తవి. దుఃఖించకు" అన్నది శాంతమ్మ.

"మంచి రోజులా. ఇంక మంచి రోజులే. ఎంతగాధ! ఎంత గొడవ! మంచి రోజులు వచ్చేట్లయితే ఇలాంటి మాటలు వస్తాయా"? అన్నది పద్మ.

"అమ్మా గృహలక్ష్మిగారింటికిపోయి ఆమెతో ఈ గొడవఅంతా చెప్పి ఏంచేయమంటుందో అడుగుదాంరా, రాముడ్ని కారు తీసికొని రమ్మననా" అన్నది శాంతమ్మ.

"అమ్మో! శారా! ఆమెతో చెప్పు కొనుట యెందుకమ్మా."

"ఎందుకేమిటి! గృహలక్ష్మి ఎంతో స్త్రీ అభిమానంగలవ్యక్తి. ఆమె ఎన్నో కథలు చదివింది. పురాణాలు విన్నది. చక్కని ధర్మాలు బోధించగలదు. అందు కనే ఆమెతో చెప్పుకొంటే ఏమిచెప్పునో చూద్దాము."

"పతియే దైవమని భావించు భార్య లను బాధించి పరాభవించుచు అనరాని మాటలు అంటూ అతి మూర్ఖులుగావున్న పురుషుల గొడవలు ఏమిచెప్పుకొందుము? అమ్మా, అలా చెప్పుకొంటే మాత్రం లాభ మేమిటి?" అన్నది పద్మ.

శాంతమ్మ ఏదో చెప్పునంతలో "అక్కా" అన్న పిలుపు అవతలనుండి వినిపించింది. వెంటనే శాంతమ్మ ఈవలి కొచ్చి "ఓహో, మీకు వెయ్యేళ్ళండి. ఇప్పుడే మీ మాటే అనుకొంటున్నాము. మీరే వచ్చారు. కూర్చోండి ఈ సోఫాలో."

గృహలక్ష్మి సోఫాలో కూర్చొని రేపు మా నాన్నగారి జన్మదినోత్సవం, కేసరి కుటీరంలోనే జరుగును. నేను పుట్టింది మొదలు మా కేసరినాన్నగారు నన్ను ఎంతో ముద్దుగాపెంచి పెద్దచేసి, పది మందికి నన్ను పరిచయంచేసి నా కీర్తి దిగంతం వ్యాపింపచేశారు. నాన్నగారికి గృహస్థ ధర్మాలంటే ఎంతో ప్రీతి. అందు కనే గృహలక్ష్మి అని నాకు నామకరణము నిడిరి. ప్రతి సంవత్సరము సువాసినీపూజ, సువర్ణకంకణ సమర్పణ మీకు తెలిసినవే గదా. మీ బోటి సువాసినీలను పిలు చుటకై నేను వచ్చాను. మీరు రేపు తప్పక రావాలి" అన్నది గృహలక్ష్మి.

"అయ్యో ఎందుకురాను? అంత కన్నానా! రాధా మాధవులకథ ఎంతో రమ్యమైనకథ. మీ గృహలక్ష్మికి బహు మతిగాకూడ తెస్తాను."

"పద్మ పండుకొన్న దేమి అక్కా."

"పద్మ బ్రతుకు తెల్లవారినట్లయింది. అందుకనే మీ సలహాకు రావలెనని అను కొంటుండగా మీరే వచ్చారు."

"అదేమిటి?"

"ఏముంది, లేనిపోని నిందలు నెత్తిపై వేసి, ఈ భార్య నాకొద్దని వెళ్ళి పొయ్యాడు."

"అయ్యో, నిన్నగాక మొన్న పెండ్లి అవటము వద్దనటమా? ఏంకారణం" అన్నది గృహలక్ష్మి.

"ఏముంది. ఎన్నడు ఎరగని మాటలు. నేను, నా కూతురు మంచి వాళ్లము కామని," ఏదో చెప్పబోతూ "అక్కా ఏం చెప్పను? యింత బ్రతుకూ బ్రతికి ఈ నాటికి యిలాంటి మాటలు పడవలసి వచ్చింది. మాది సాని వృత్తిట. వ్యభి

చారముతో బ్రతుకుతున్నామని-మానహీనమైన మాటలు వినలేము, కనలేము-ఏం చెప్పను!" అంటూ శాంతమ్మ దుఃఖించింది.

గృహలక్ష్మి నివ్వెరపోయి "సానివృత్తియా! ఏకుటుంబాన్నిగూర్చి ఈ మాటలు" అంది.

"అక్కా మా కుటుంబమే - మనుష్యులనే. ఔపోసన అయిన రెండు రోజులకే పిల్లను బాధించటం మొదలు పెట్టాడు. ఎల్లప్పుడు అతనికి అత్యవసరాలే వస్తూ ఉంటవి. డబ్బు డబ్బు అని వేధిస్తూ ఉంటాడు. రెండువేలు మీ నాన్న నడిగి తెస్తావా లేదా అంటూ పద్మని ఎంతో బాధించాడుట, పద్మ చెప్పలేకపోయింది. ఒక రోజల్లా పద్మను గదిలోనుంచి ఈవలకు రానివ్వనేలేదు. కాఫీ, ఫలహారాలే లేవానాడు. రాత్రి పదిగంటలువరకూ చూచి తలుపు తట్టాను నేను. ఎవ్వరూ పలుకరు. నా కెంతో భయంవేసింది. మీ బావగారొచ్చి గట్టిగా పిల్చారు. అల్లుడు తలుపుతీసి బయటకు వెళ్లిపోయాడు. ఇల్లా చూద్దుముగదా, పద్మ కటికనేలపై పడుకొనివుంది. నేనూ ఆయనా లోపలికివెళ్లి పద్మను లేవతీసి కూర్చోపెట్టాము. వెక్కి వెక్కి ఏడుస్తూ ఎంతసేపటికీ ఏమీ చెప్పదు. ఎన్నో విధాల బ్రతిమాలంగా "రెండువేలు నీ తండ్రి నడిగి తెస్తావా లేదా, - తెస్తేనే గది తలుపుతీయి, లేకపోతే గది తలుపుతీసి బయటకు పోవద్దు అన్నారు ఆయన" అని చెప్పింది. అల్లుడు డ్రాయింగు రూములో ఉంటే మామగారువెళ్ళి ఏమిటి నాయనా అని అడిగారు. తనకేదో మునిగిపోయే అవసరం వచ్చిందని పైకం కావలెనని అన్నాడట. 'నీ అవసం నాతో చెప్పాలిగాని చిన్న పిల్లను బాధించటం ఎందుకు' అంటూ తన కూతురు సుఖముకై పైకం తెచ్చి ఆ రాత్రే యిచ్చారు. ఆ రాత్రి యెల్లాగోగడిపి, తెల్లవారకముందే వెళ్ళిపోయాడు. ఆ నాటినుండి ఈ నాటివఱకు రాలేదు. అందరితో యిదే ప్రచారం. మొన్న పద్మకు ఒక జాబు వ్రాశాడు పిచ్చగా.

"నీ తల్లి నీవు కులటలు, వ్యభిచారులు. నీ తండ్రిచేత 50 వేలు యిప్పించు, లేదా నాకు డైవర్సుఇయ్యి" అని. ఈ రెండే ముక్కలు ఆ జాబులో. ఈ డబ్బు పిచ్చకు అంతే లేదాయె. పదివేలు కట్నమిచ్చినదిచాలక తాను అడిగినప్పుడల్లా వేలు ఎచటనుండి తేగలమక్కా?" "బావగారి మెత్తదనం కనిపెట్టినాడా బుద్ధిమంతుడు! మొదలే అవకాశం ఇవ్వగూడదిట్టి మూర్ఖులకు. కాలంమారి ఘనమైన విద్యాబుద్ధులునేర్చి స్వాతంత్ర్యం, స్వాతంత్ర్యం అనిచాటే ఈ దినాలలో ఇంకా ఇట్టి అవినీతిగల స్త్రీ పురుషులున్నా

రంటే ఏంచెప్పాలి? అవధానిగారి అరుంధతి అసలే లేచివచ్చింది, అత్తవారింటి నుండి. చక్కని కాపురం. ఆరూపోరూ లేదు. తను భర్త ఇద్దరే. తన చుట్టాలను భర్త పలుకరించలేదట. భర్తవేపు బంధువులు ఇంటికివస్తే తాను పలుకదట. అదేమీ అని భర్త అంటే భరించలేక వచ్చేసిందట. పోనీ ఆ పిల్ల వచ్చిందనుకో. తల్లి దండ్రులు ఆమోదించి ఇంట్లో అట్టి పెట్టుకొనటమా. పైగా పైపెచ్చు పది మందిగలిసి వారి యింటిపైకివెళ్ళి నానా మాటలు అని వచ్చారట. అరుంధతి ఆ యింటికైన ఆడది. కాపురానికివచ్చి బిడ్డలనుకని పరులకై కీచులాడుకొని పండంటి కాపురం పాడుచేసుకొనే ఆ స్త్రీ తెలివికై చింతించుచున్నాను. గృహస్థ ధర్మమే తెలియకపోయెను. అది సనాతనమైనప్పటికి ఈ నవీనకాలంలో ప్రేమ అనుకొనే ఆ ప్రేమ. ప్రేమలక్షణమైనా తెలియదాయె. వివాహమనే అనుబంధం స్త్రీ పురుషులకు ఏర్పడిన తరువాత 'అర్థే చధనే చవామే చనాతి చరామి' అనే ధర్మాన్ని అనుసరించుకొని పురుషుడు ప్రేమించాలి. 'కార్యేషుదాసి, కరణేశు మంత్రి' అనే ధర్మయుక్తమైన ప్రేమతో భర్తకు అనుగుణ్యంగా భార్య నడుచుకొనుటలోయున్న నేర్పు, ఓర్పు ఎంత గొప్పది, ఎంత కీర్తి, ఎంత, సుఖము ఉన్నదో ఎరుగరాయె. స్త్రీ స్వాతంత్ర్యం ఏర్పడి స్త్రీలుగూడ పురుషులతో సమానంగా విద్యాబుద్ధులునేర్చి స్వతంత్ర జీవనం చేయుట, లోకం ఇంకా తెలుసుకోలేదా? పల్లెటూళ్లన్నీ ఎంతో బాగుపడి స్త్రీ విద్య ప్రచారంలో ఉన్న దినాలు యివి. నాగుజెముడు పురుగును నాశనంచేసినట్లు స్త్రీ అజ్ఞానాన్ని నాశనంచేసింది ఆంధ్ర మహిళా సంస్థ. కాని స్త్రీ తన విజ్ఞానంతో తాను కుటుంబభారం వహించి పుట్టింటికి, అత్తింటికీ కీర్తి గడించుట ధర్మమని ఇంకా మూర్ఖచిత్తులు కొంతమంది తెలిసికొనలేదు. తన ధర్మమును తాను రక్షించుకొనుటే జన్మజడకుండుటకు కారణము అనిగూడా ఎరుగరు. ఇంక పురుషుడు తన భార్యను ఎట్లా ప్రేమించవలెనో, ఎట్లా గౌరవించవలెనో, తన తలి తన యింటికి ఒకప్పుడు ఎల్లా స్వతంత్రించిందో, తమతో బుట్టువులు వెళ్లినచోట సుఖించుట ఎట్లా కోరుకొనుచున్నారో భార్య తన యింటికి అట్టి సుఖమునకే వచ్చినదని తెలిసికొనుట లేదు కొంతమంది యువకులు. 'చిన్న నా పొట్టకు శ్రీరామరక్ష' అని ఈ స్వార్థానికి అంతుకనుపించుటలేదు. డైవర్సు యిమ్మని అడిగే పద్మ భర్త పెళ్లెందుకు చేసుకొన్నాడు? ఏమి తెలియని చిన్నతనమా? పురుషులలోనే ఇంకాఇంత అవినీతి ఉన్నదంటే యింక స్త్రీలమాట ఏమిచెప్పాలి? అక్కా చాల రాత్రి అయింది. తరువాత ఆలోచిద్దాము పద్మ విషయము. నేను వెళ్ళివస్తాను.''

# "జగన్నాటకం"

శ్రీమతి 'హృదయిని'

ఆ రాత్రి మా యింటికి దగ్గరేఉన్న గరల్సు హైస్కూలులో కొత్తగావచ్చిన నాటక కంపెనీ వారు ఒక నాటకం ప్రదర్శిస్తారని తెలిసింది. మాలతి యింటికి వెళ్ళాను. మాలతిలో మార్పేమీ లేదు. ఆమె పలుచని పెదవులమీది ఆ విషాద శబలతా మిశ్రితహాసం ఆమెను వదలిపోలేదు.

'మాలతీ ! ఈ రాత్రి మా యింటి దగ్గర ఒక నాటకం ఆడతారట. నీవు తప్పకుండా నాతోపాటు రావాలి ఆ నాటకానికి.'

'అనూ ! నేనెందుకు ? నీవే వెళ్ళిరా !'

'అలా కాదు మాలతీ ! నీవిలా చెపుతావని నాకు తెలుసు. చూడు_ఇద్దరంకలిసి పూర్వం సినిమాలకు, డ్రామాలకు వెళ్ళివచ్చేవాళ్ళం. నీవాపాడు ఆశ్రమం నుంచి వచ్చినప్పటినుంచి వెనకటి మా మాలతివికావు. ఒక సినిమాలేదు ! ఒక డ్రామా లేదు !'

ఆమె ఒక చిర్నగవు నవ్వింది ! 'అనూ ! ఈ సినిమాలూ - డ్రామాలూ నన్ను వెనకటి మాలతిని చేస్తవి అంటావా !'

'ఎందుకు చేయవు ! నీవీ విధంగా ఉదాసీనంగా ఎంతకాలమని గడుపుతావు ?'

'ఉదాసీనతా ! నేనిప్పుడేం ఉదాసీనంగా ఉన్నాను !'

'అయితే నీవీరాత్రి నాతోపాటు నాటకానికి వస్తావుగదా !'

'వస్తాలే అనూ ! మా నాన్ననుగూడ పిలువు.'

ఆమెలో హృదయపూర్వకమైన ఉత్సాహం లేదని నాకు తెలుసు. కాని ఆమె యిట్లాయినా మెల్లగా వెనకటి చిర్నగవులు చిందుతుండే మాలతి అవుతానికి నాంది అగుతుందని మనసులో అనుకొన్నా.

మాలతినాన్న సత్యనారాయణబాబుకూడా నాటకానికి రావడానికి సమ్మతించారు. మాలతి నాటకానికి రావడానికి ఒప్పుకొన్నదని నేచెప్పినప్పుడు అతని కళ్ళలో ఆనంద సూచనా రేఖలు చలించినవి. ఆశ్రమంనుంచి మాలతిని తీసుకొచ్చి ఆరునెలలయింది. కాని ఆమెను ఆవరించిన హృద్రోగం - విషాదం ఏమీతగ్గలేదు. ఆమె బయటికే రావటంలేదు. పలకరించితే ఏదో నిరాశామయ మందహాసంతో సమాధానమిస్తుంది. ఆమెకూడ నాటకానికి వస్తానన్నదని చెప్పటంతో ఆ వృద్ధునికెంతో ఆనందం కలిగింది.

మా యింటి ప్రక్కని గరల్సు స్కూలు ఆవరణలోనే స్టేజీ అంతా సిద్ధంచేసిఉంది. రాత్రి 8½ గంట అయింది. అప్పటికే జనం చాలామంది స్టేజీముందు కూర్చుని ఉన్నారు. ప్రేక్షకులు కూర్చునే చోటును రెండు భాగాలుచేసి ఒకవైపు పురుషులకు రెండవ వైపు స్త్రీలకు నిర్దేశింపబడింది. మధ్యభాగం చిన్న త్రోవగా స్టేజీదగ్గరకు పోవటానికి వీలుగా విడచి ఉంది.

స్టేజీకి దగ్గరగా, మాలతీ, నేనూ స్త్రీల మూడవ వరుసలో కూర్చున్నాం. మాలతీనాన్న తన స్నేహితుల దగ్గర కూర్చున్నాడు. పురుష ప్రేక్షకులలో కొందరు ధూమావృత మేఘాలను సృష్టిస్తున్నారు. కొందరు ఏవో ముచ్చట్లు చెప్పుకుంటున్నారు. మరి కొందరు నాటకం ఎప్పుడు ఆరంభిస్తారా అని ఉత్కంఠతో వేగన్నులతో ఎదురు చూస్తున్నారు. స్టేజీపైన కట్టిఉన్న లౌడ్ స్పీకర్లనుంచి ఏవో సినిమా పాటలు పాడుతున్నవి. ఇంకా తెర దించేఉంది.

పాట లాగిపోయినయి. 'మహాజనులారా! నమస్కారం. కొద్ది క్షణాల్లో మా సరిక్రొత్త నాటకం - 'జగన్నాటకం' క్రొత్త నట నటీ వర్గంతో తయారు చేసింది ప్రదర్శించబోతున్నాం. మీరంతా నిశ్శబ్దంగా - శ్రద్ధగా నాటకాన్ని చూస్తారని మా ప్రార్థన !'

వీణ, ఫిడేలు, హార్మోనియంల స్వరసమ్మేళనంతో సంధ్యాసమయాన్ని సూచించే రాగం ఆరంభమయింది. ప్రేక్షకులంతా శ్రద్ధతో నాటకరంగం ముందున్న తెర ఎప్పుడు పైకి లేస్తుందా అని ఉత్సాహంతో నిరీక్షిస్తున్నారు. మాలతీ కోమల హస్తాన్ని నా చేతిలో ఉంచుకొని నాటకాన్ని చూడమన్నట్లుగా ఆమెనుద్దేశించాను.

తెర లేచింది. అది ఒక పుష్పవాటిక. ప్రశాంత సంధ్యాసమయం. ఒక తిన్నెమీద ఒక యువపరివ్రాజకుడు. ఆయన పాదాల చెంతనే ఒక అందమయిన పదారేళ్ళమ్మాయి. ఆ అమ్మాయి ఆ తరుణ సన్యాసి ముఖాన్ని ఆప్యాయంగ చూస్తూఉంది.

అతడు:_"లతా! నేను కనుపించకపోతే నీ వెందుకిలా వెఱ్ఱిదానివిలా అయిపోతావు. ఆశ్రమానికి మోక్షసాధనానికై వచ్చి హృదయపూర్వకంగా తాపసవృత్తి స్వీకారంచేసిన మనలో ఈ నూతన పరిణామం ఎందుకు గలిగింది ?"

ఆమె:_"బ్రహ్మచారీ! నాకేమి తెలుసు ఆశ్రమంలోని వేదాంతోపన్యాసములు! గురుబోధలు వింటున్నంతసేపు ఏదో లీలగా అర్థమవుతయి. నా చెవులు మాత్రం స్వామీజీ బోధలు వింటుంటయి. నా కన్నులు చాటుగా మిమ్మలను చూడ్డానికి పరుగులిడుతుంటయి. మనసు మీ ధ్యానంతోనే నిండి ఉంటుంది.

అతడు:_'నీవు పుట్టిందెక్కడో! నేను పుట్టిందెక్కడో! ఇద్దరం యీ ఆశ్రమంలో కలుసుకొన్నాము. ప్రార్థనామందిరంలో ఆశ్రమవాసులంతా చేరుతున్నప్పుడు ఆనాడు మిగతా భక్త మహిళలతో నీవు రావటం తలవని తలంపుగా చూచాను. ఆ ఘడియ ...'

ఆమె:_'ఆ మధుర ఘడియే! నా హృదయంలో స్నేహ పిపాసను పుట్టించింది. అప్పటికి పది రోజులయింది, నేనాశ్రమంలో చేరి. మీ నిర్మలమైన చూపులు ఆ మధురమైన ఘడియనుంచే నన్ను ఇలా చేసినయి. పూర్వ జన్మలో మీతో ఏదో నాకు గాఢ స్నేహం ఉన్నట్లు భావిస్తూ వచ్చాను.'

అతడు:_'లతా! నా హృదయంలోని స్థితీ నీలాగే ... ప్రార్థనా మందిరంలో నీవు రావటం కొంచెం ఆలస్యమయితే, ఏదో పోగొట్టుకున్నట్లు నీకై ద్వారంవైపు నా కళ్లు దొంగతనంగా - పిచ్చిగా - పరుగులెత్తుతయి. అప్పుడు లోపలికెవరు ప్రవేశిస్తున్నా నీవేనని తోచేది. ఆనా అనుచితమైన పనికి నాలో నేను వితర్కించుకొనేవాడిని - లత లేకపోతే ఇంత అతృప్తి ఎందుకు నీకు ?' అని

ఆమె:_'బ్రహ్మచారీ! ప్రతి సాయంత్రం మీరు విహారానికై పావుకోళ్లు వేసికొని వెళుతుంటే, ఆ చప్పుడువిని మెల్లగా నా పాదాలు కదిలేవి. మీ అడుగుల్లో అడుగులేసికొని మిమ్మల్ని అనుసరించాలని బయలుదేరేదాన్ని. కాని ఆశ్రమ విధులు నన్ను కట్టివేశాయి.

అతడు:_'లతా! ఇది ఒకరకమైన పిచ్చి!'

ఆమె:_'ఏమో బ్రహ్మచారీ నాకేమీ తెలియదు. మీరు సంధ్యా సమయంలో ఈ తిన్నెమీద కూర్చున్నప్పుడు - సూర్య కిరణాలు మీ ముఖము, వక్షస్థలముమీద ప్రకాశిస్తున్నప్పుడు - చిరుగాలి మీ అలకలతో ఆటలాడుకొంటున్నప్పుడు ఈ విధంగ మీ చరణాల చెంత కూర్చునాలని నా హృదయం ఎందుకో ఉవ్విళ్లూరుతుంది.'

అతడు:—'లతా! నీ విశాల హృదయంలో ఈ అభాగ్య సన్యాసికింత చోటిచ్చావా! ... నా ధ్యానంతో నీకేమి ఒరుగుతుంది?

ఆమె:—'ఏమో బ్రహ్మచారీ! నాకేమీ తెలియదు.'

అతడు:—'అవును వేదాంత చర్చలను, యోగశ్లోకాలను విపులంగా అర్థంచేసికొనే నేను నాలో వ్యాపించిన ఈ పరివర్తనాన్ని అర్థంచేసుకోలేక పోతున్నానుగదా!'

ఇంతలో ఒక పరివ్రాజకుడువస్తూ ఒక పూలచెట్టు వెనక నిలబడిపోయాడు. చెవులు నిక్కించి ఆ జంట మాటలను వినసాగాడు.

ఆమె:—'బ్రహ్మచారీ! ఈ ప్రపంచంలో స్త్రీ పురుష భేదంతో సృష్టి ఎందుకు జరిగిందో నాకర్థం కావటంలేదు. వారిద్దరిమధ్య ఏదో అర్థంకాని ఒక బంధం వ్యాపించి ఒకరికోసం మరొకరు తపించటం - ఇవి నా చిన్ని మనసు కగమ్యంగా ఉన్నయి. ఇది సృష్టిలోని ఒక తప్పని సరియైన సహజస్థితి యేమోనని తోస్తుంది!'

అతడు:—'లతా, నా తలి దండ్రులు గతింపగా కల్లోలిత హృదయంతో ఈ యాశ్రమానికి వచ్చాను. దృఢమానసంతో సాధనచేస్తూవచ్చాను. ఇప్పుడది ప్రేమసాధనగా మారింది. నాలో పూర్వదృఢ మనశ్శక్తిలేదు. వేషమా సన్యాస స్వీకారాన్ని తెలుపుతుంది! హృదయమా నీ స్నేహానందంతో నిండిఉంది! 'లోకాన్ని పవిత్ర సన్యాసవేషంతో మోసగిస్తున్నావు మాధవా' అని నా మనసు తిరుగుబాటు చేస్తూంటుంది.'

ఆమె:—'నేనూ అప్పుడప్పుడిదే స్థితికి లోనవుతుంటాను బ్రహ్మచారీ!'

అతడు:—'లతా! గురూజీకి మన స్థితిని నివేదిస్తామని అనుకుంటున్నాను. కాని ...'

ప్రక్క పూలచెట్టు కదులుతుంది. అక్కడ నిలబడిన పరివ్రాజకుడు వెనుదిరిగిపోయాడు.

ఆమె:—'కాని ... ఏమి ఆగారు?'

అతడు:—'ఏమీలేదు. మనమిద్దరం కలుసుకోటం, రోజు రోజుకు పెరుగుతున్న స్నేహాన్ని కనిపెట్టి మన సోదర శిష్యుఁడు, సుబుద్ధి గురూజీకి నివేదించాడు ఈ మధ్య. వెంటనే గురూజీ నన్ను పిలచారు - మాధవా! నా శిష్యుల్లో నిన్నెంతో ఉత్తమునిగా భావిస్తున్నాను. నా తర్వాత ఆశ్రమాధికారిని చేయాలనుకుంటున్నా. కాని. నీవు లతతో ఏకాంత సంభాషణ చేస్తున్నావట! - అని ప్రస్తావించారు. కాని ఆ సమయంలో గురూజీ ఆగ్రహాన్నిచూచి మనసులోని నిరంతర విప్లవాన్ని వివరంగా తెలిపి మన యిద్దరికి గృహస్థాశ్రమం ప్రసాదించమని వేడుకోటానికి జంకాను. లతా! నీవీ దరిద్ర భిక్షువుని పెండ్లి చేసుకుంటావా?'

మా మాలతివైపు చూచాను నేను. ఆమె కనులందు అర్థంకాని అశ్రుబిందువులు ఆ లైట్ల వెలుగులో చూచాను. ఆమెలో విస్మయాతిరేకము, హర్షాతిరేకము పెనవేసికొని ఉన్నయి. ఇది ఒక్క క్షణంలోచూచి, వెంటనే నాటకంమీదకు నా దృష్టి మరల్చాను. ఆ ముగ్ధ సుందరి యిలా సమాధానమిచ్చింది—

'బ్రహ్మచారీ! మీరు నా హృదయాన్ని అర్థంచేసుకోనికూడా యిలా ప్రశ్నిస్తారేమిటీ? నన్ను మీకెప్పుడో అర్పణచేసుకొన్నాను, స్వచ్ఛమైన యీ సూర్య కిరణాల సాక్షిగా.'

'లతా!' - అని అతడామె కోమలకరాన్ని తన చేతిలోనికి తీసుకొన్నాడు ప్రమోదంతో.

'నాతో మొదట మీరు మాట్లాడకుండా ఉన్నప్పుడు నాకెంతో భయమేసింది. సముద్రంలోని తరంగాలవలె నాప్రేమ నాలోనే లీనం చేసుకోవాల్సి వస్తుందేమో అని!'

అప్పుడు వెనుక పూలమొక్క చాటున కొంచెము నేపు నిలబడి పోయిన సన్యాసి, జడధారి, జప

మాలాధారి అయిన యింకొక ప్రౌఢసన్యాసి, గురూజీ లాగున్నాడు ఒక పూల పొదవెనుకకు వచ్చి నిలబడ్డారు.

అతడు:—'లతా! నాహృదయం, శరీరం - అంతానీవే. పవిత్రమైన జగద్బాంధవుడి అరుణ కిరణాలు చూడు. ఆ పక్షిబృందాన్ని చూడు. తమ గూళ్ళ కొక్కబోలు ఎలా వెళుతున్నయ్యో! అటు చూడు! వాటిలో ఒక జంట - సతీపతులు కాబోలు ఊవ్విళ్ళూగా, ఉల్లాసంగా గాలిలో తేలిపోతున్నయి!

ఆమె ఆబ్రహ్మచారి చరణాలను స్పృశించుతూ, ఆయన కళ్లకేసి అలాగా తనివిదీర చూస్తూ ఉండి పోయింది!

అతడు:—'లతా,'

ఆమె:—'ఆఁ!'

నేను వారిద్దరి నిష్కళంకమైన ప్రేమచే సంచలిత మనస్వినయ్యాను. మాలతి స్థితి ఎలా ఉందా అని ఆమెవైపు చూచాను. ఆమె నయనాల వెంట అశ్రు బిందువులు రాలుతూ ఆమె నునుచెక్కలను ఆర్ద్రం చేసినయి. ఆమె అధరాలు కంపిస్తున్నయి! నేను చూడటం చూచి, నాచేతులను తనచేతుల్లోకి తీసికొని 'అనూ'! అని ఆత్రముగా పలకరించింది! ఏదో చెప్పబోయి ఆగిపోయింది! మరుక్షణమే యిద్దరమూ నాటకంవైపు ధ్యానం మరల్చాం. నేపథ్యంలో ఒక మగగొంతు, ఆడగొంతు కల్సి పాడుతున్న గాగం ఆరంభమైంది. ఆరాగానికి అనుసరణగా హార్మోనియం, ఫిడేలు స్వరాల్ని పలుకుతున్నయి.

అతడు:—'లతా' ఆ పాటవిను! ఎవరో మనలాంటి ప్రేమికుల్లా ఉంది పాడుతున్నారు!

"రాణీ! ఓ ... రా ... ణీ ...!
రాజా! నా .. రా ... జా ...!
రాణీ ... ... ... ... ...!
ఈ చిరుగాలిలో ఈ తెలిసోశలో,
ఈదుకుంటూ పోదామే!
ఈ చిన్ని పడవెందుకే ...!
వద్దునాసామీ! లోతైన ఏటిది!
ఈదలేక మునిగి పోతా మిద్దరమూ!
ఈ అలలపైనే తేలిపోయే
మనప్రేమ పడవుండగా ... రాజా!
రాణీ!!
రాజా!!"

అని ఆనేపథ్యగీతం శ్రావ్యంగా ఆరెండు గొంతుకలు పాడటం పూర్తఅయింది.

అతడు:—'లతా! నడువు ఆశ్రమానికి. ప్రార్థనా సమయమయింది. సోదర శిష్యులు సిద్ధంగా ఉంటారు, మందిరంలో గురూజీ నాకోసం ఎదురు చూస్తూంటారు

పూలపొద చాటునుంచి ఆ ప్రౌఢసన్యాసి ఒక్కసారిగా లతామాధవుల ముందుకు వచ్చి నిలబడ్డాడు. శిష్యుడుగూడా ఆతడి వెనుకనే వచ్చాడు.

ప్రౌఢసన్యాసి:—'మాధవా! గురూజీ నీరాకకై ఎదురు చూస్తూంటారా! నీ కృతిమ పరివ్రాజక వేషం! నీ ఏకాంత ప్రేమాలాపనలు! నీ నిజ స్వరూపం నేటికి ప్రత్యక్షమయింది. లతతో మాట్లాడేది వేదాంత చర్చయని చెప్పి, ఇదా నీవాడుతున్న నాటకం! కపటీ!'

హఠాత్సంభూత సంఘటన కులికిపడి ఆ లతా మాధవులు లేచి నిలబడ్డారు.

మాధవుడు:—'స్వామీజీ! మీ...'

ప్రౌఢ:— 'చాలు. స్వామీజీయట! ఎంతవాడివెలా మారిపోయావు! నీమీద నాకున్న ఆశలన్ని భగ్న మయిపోయినయి. ఆశ్రమానికి ఎంత అప్రతిష్ఠ తేస్తానికి సిద్ధమయ్యావు?'

మాధ:_ లేదు. గురూజీ !

ప్రౌఢ.- మాధవ్ ! చాలించు. ఇక నీమాటలు విన నవసరంలేదు. ఎంత దౌర్భాగ్యుడవయ్యావు! సంధ్యాసమయ విహారానికై బయలుదేరేది ప్రియ సమాగమ ప్రాప్తికా ! ఛీ... పతితుడా!

మాధ:- స్వామీజీ వినండి. మీరన్నట్లు ఈలతకు నాకు ప్రేమాను బంధం ఉన్నమాట నిజమే. మా యిద్దరిమనసుల్లో చెలరేగుతున్న నిరంతర విప్లవాన్ని మీకు నివేదించ.......

ప్రౌఢ:- నివేదనా, నిర్వేదనా ! నాపవిత్రాశ్రమానికి మాయని కళంకం తేవటానికి సిద్ధమయిన నీవూ నీ మాటలూ -

మాధ:- 'వినండి స్వామీ. నేనూ లతమీదకలిగిన ప్రేమను తలంచుకొని మనసులో చాలా ఖేదపడుతూ వచ్చాను. ఆశ్రమవాసం చేస్తూ - సన్యాస స్వీకారం చేసి బ్రహ్మజ్ఞాన సాధన చేస్తూన్న నాకిది అర్హమైంది కాదని ... కాని నాయువహృదయంలో లతాస్నేహం అశాంతిగా ఉండేది ఈ నిరంతర మానసిక కల్లోలాన్ని మీకు నివేదించి, మాయిద్దరికి గృహస్థాశ్రమంను ప్రసాదించి ఈ ఆశ్రమవనిలోనే ఒక చిన్న కుటీరంను అనుగ్రహించి ప్రార్థించదలచాను. సమయం లభించక మీకు తెలుపలేక పోయా నీవిషయం_అదే నా దోషం'

ప్రౌఢ:_ మాధవా ! ఏమిటీ నీవు చెప్పేది! గృహస్థులకా ఈ ఆశ్రమంలో స్థానం ! చాలించు నీ ప్రలాపం

మాధ:- స్వామీజీ!

ప్రౌఢ:- 'మాధవా ! ఈ ఆశ్రమం యోగసాధనా వైరాగ్య నిష్ఠాపరులకేగాని మందభాగ్యులయిన గృహస్థులకు స్థానం కాదు. ప్రథమదోషంగా భావించి మన్నిస్తున్నా. ఇంక నీవు లతతో సంభాషించకూడదు - కలుసుకొనకూడదు. తెలిసిందా ! చేసిన దోషానికి శిక్షగా ఈవారం దినాలు ఇద్దరికి ఉపవాసదీక్ష విధిస్తున్నాను. నడు ఆశ్రమానికి (వెంటనున్న శిష్యునిచూచి) సుబుద్ధీ! లతను ఆశ్రమానికి తీసుకురా.'

(సశేషము)




ప్రజా సంక్షేమమునకు
ప్రజా ప్రణాళిక

AC/55/113,TG

# అమ్మ

శ్రీ కన్నెకంటి ప్రభాకరశాస్త్రి

అమ్మవునీవు నన్నుగని ! అందముగా నలరించి ప్రేమతో
కమ్మని పాలొసంగి నను క్రన్నన బెంచితివమ్మ ! ఎన్నియో
ఇమ్ములు గల్గినన్ మదిలొ యించుక బాధనుపొంద వీ ప్రపం
చమ్మున గందునే పరమసాధ్విని ! నిన్ను మదీయమాతరో !

తెలియక కొన్ని వస్తువులు తెమ్మని నిన్ను ననేకమార్లు కన్
గొలకుల నీరు నింపుకొని గొల్లున నేడ్చితి మందహాసవై
అలుకనుదీర్చి కోర్కెలను నన్నిటి కూర్చి అమ్మ ! కాని నీ
పలుకులలోన తేనియలు పారును ఎంతటి ప్రేమ మాతవో !

నడక నేర్పుటకై నీవు నన్ను జేరి – రెండు చేతులతో నాకు పండునిచ్చి
విడిచి వెల్లగా ప్రక్కకు వెడలినావు – పరుగు పరుగన వచ్చినే పడితి క్రింద!

పెద్దగ కేకవేసి నను ప్రేమతొ లేవగదీసి దీనవై
అద్దుకొనంగజూచి కడు ఆర్తజనావనివై గబాలునన్
ముద్దుడు కొంటివమ్మ ! సుమమూర్ధము ప్రేమ ప్రవాహ జాలులో
సద్దును వీనులారవిని చక్క నేర్చితి నీదు వ్యూహలన్.

చిన్ని నాన్నను మూర్ఖునై చేతులార - క్రిందపడునట్లుచేసితి మందమతిని !
నాన్న కేదైన గాయంబు నాటెనేమొ ! – పాపురాలను ! రక్షించు ! పార్థివుండ !

ముఖము పైకెత్తి చిన్నగా ముద్దులొలుక – అమ్మ ! నీ వదనంబులో కరసినాను
హావభావాలు నాట్యంబు లాడుచుండె – దీనమంతయు నేత్రాల దీప్తిజెంద !

చిన్నగా నవ్వి నేను నీ చేతులందు – వ్రాల పవిటను ప్రక్కకు తొలగజేసి
పాలు త్రాగుచు నుండగా పలుకరించి – ఎంత సంతసమందితో ఎరుగగలనె !

ఇంత ప్రేమను నెట్టిచ్చె నీశ్వరుండు – కన్న మాతను సృష్టించి కష్టములను
పారద్రోలుచు నుండెను పరమశివుడు – లేనిచో సుఖం బెరుగము లేశమైన.!

ప్రాణముల నీయగానైన బాధపడవు – కన్నతల్లిని మించిన మిన్నదైవ
మెందు వెదకిన గాంతుమే ఎక్కడైన 'తల్లి' మించిన దైవంబు ధరణిగలదె !

---

# తెల్లరోజా!

| రచయిత్రి : | అనువాదము : |
| --- | --- |
| ఇన్‌గే షోల్స్ | డాక్టరు వి. ఎన్. శర్మ |

II

నాజీ యువక బృందం ఈ కాలంనాటిది. దీని కన్నా వున్నతాశయాలుగల యువక బృందం మా దేశంలో బహు శతాబ్దాలనుంచి తన విధ్యుక్త ధర్మాన్ని బహు చక్కగా నెరవేర్చుతూ వుండేది. అన్ని మత సంప్రదాయాలవారికి, అన్ని రాజకీయ వర్గాలవారికి ఈ యువక సంఘంలో సభ్యులుగా వుండడానికి సంపూర్ణ స్వాతంత్ర్యం వుండేది. ఈ ఉద్యమాన్ని వాన్‌డర్‌షాఫ్ట (Wanderschaft), వాన్‌డర్ ఫోగల్ (Wandervoegel) అని పేర్కొనేవారం. జర్మను యువకుడు, జర్మను యువతి తన మాతృదేశాన్ని చక్కగా అవగాహనం చేసుకొనడానికి దేశాన్నంతా ఒకసారి చుట్టిరావడం అత్యవసరం. తద్వారా దేశంలోని ప్రకృతి సంపదను తెలుసుకొనవచ్చును. శిల్ప, నాట్య, చిత్ర, నాటక కళలలోని మధురానుభూతిని తనివితీరగా అనుభవించవచ్చు. సాహిత్య వీధుల్లోని రహస్యాల్ని చక్కగా తెలుసుకొంటూ ఆ కళని తమ జీవన వికాసానికి యథేచ్ఛగా నుపయోగించుకొనవచ్చు.

ఈ ఉద్యమంపట్ల అన్ని కాలాల్లో రాజులు అభిమానాన్ని చూపారు. ప్రజాకోటి చూపాలసిన శ్రద్ధను చూపి, దాని అభివృద్ధికి ఎంతో సహాయపడ్డది. హిట్లరు ముఠా అధికారానికి వచ్చాక ఈ యుద్యమాన్ని ధ్వంసంచేయడానికి ప్రయత్నించింది. దానిని తమ కార్యసాధనకు తటపటాయించక వుపయోగించుకొనడానికి ప్రయత్నించింది. పాతపద్ధతుల్ని సమర్థించడానికి ప్రయత్నించినవారిని పెట్టాలసిన బాధల్ని పెట్టింది. కాని అధికారుల అస్త్రశస్త్రాదులమూలాన ఈ యుద్యమం చావలేదు. సభ్యులు ఎంతో జాగ్రత్తగా ఈ యుద్యమాన్ని హిట్లరు అధికారపు రోజుల్లోకూడా నడపడానికి శాయశక్తులా ప్రయత్నించారు. ఈ కార్యసాధనకు వాళ్లకు ప్రత్యేక సాంకేతిక భాష వుండేది. జర్మను సంస్కృతిని ఆధునిక వాతావరణానికి అనుగుణ్యంగా ప్రజల వ్యక్తిత్వాన్ని నిలువబెట్టడానికి, ప్రతివారూ తమ జన్మ హక్కుల్ని మరచిపోక, ఇరుగు పొరుగు వారలకు సహాయభూతులుగా నుండాలని బోధించసాగింది. నేడు ప్రజలకు, ముఖ్యంగా, యువక లోకానికి కావాలసిన ఆదర్శం ఇదేకదూ. హిట్లరు ముఠా ఎంత కట్టుదిట్టంలో యువకుల్ని వుంచినా యువకుల దృష్టి ఈ వంకకే పోసాగింది. సహజంగా యువకులు వాంఛించేది అందరినీ సమాన భావంతో చూడడం, ఇతర్ల కష్టాల్ని అవగాహనం చేసుకొని, వాళ్లని అట్టివాటినుంచి రక్షించడం. విశాల ప్రపంచం అనేది ఏమిటో ఈ దృష్టితో చూస్తేనేగాని మనకు అర్థం అవడం కష్టం. చలివుంటుంది. ఎండవుంటుంది. ఈ రెంటిలో ధైర్యంతో నిలువబడి వుండడానికి శక్తి సంపదలను సంపాదించుకొనాలి. ఈ పనికి అవసరమైన శిక్షణను యువక సంఘము అందరికీ ప్రసాదించింది.

ఇట్టి సంఘప్రశాఖ మా వూళ్లోనే వున్నదని తెలుసుకొన్నాక హాన్స్ అందులో చేరాడు. తమ్ముడు వెర్నర్ అన్న మార్గాన్నే అనుసరించాడు. హాన్స్ వయస్సు అప్పటికి 18 సం॥లు. వెర్నర్ వయస్సు 14 సం॥లు. అక్కయ్యా, నేనూ చేరాం. అప్పటినుంచి మా వుత్సాహాన్ని ఆపడానికి పగ్గాలులేవు ...

సెలవు దినాలు వచ్చాయా ఇంట్లో వుండేవాళ్లం కాము. ప్రకృతి దృశ్యాల్ని, కళా మందిరాల్ని చూడడానికి దూర ప్రదేశాలకి క్యాంపులకి వెళ్లేవాళ్లం. తనివిదీరా రాత్రిళ్లు చలిమంటలు వేసుకొంటూ జానపదాల్ని పాడుకొంటూ మా భవిష్యత్తును గురించి చర్చించడానికి మొదలుపెట్టాం. చేతి పనుల్ని నేర్చుకొన్నాం. మా పద్ధతి కనుగుణ్యంగా పుస్తకాల్ని, పత్రికల్ని, తయారుచేసేవాళ్లం. ఈ పని అంత సులభమైందికాదు. విశాల దృష్టితో ఈ పనికి కావలసిన పరికరాలని సేకరించాలి. మేము వాటిని చదివి ఆనందించడంలో తృప్తిపడకూడదు. వీటిని మాకు తెలిసినవారి కందరికి మా మార్గంలోనే పంచిపెట్టేవాళ్ళం. ఇట్టి పుస్తకాలు, ఇట్టి పత్రికలు ఈ రోజుల్లో అందరూ చదువుకొనడానికి అదృష్టం వుంటేగా ? నాజీలు పిల్లలకు ఇచ్చే పుస్తకాలు, పత్రికలు వేరు. ఈ సంఘం యువక లోకానికి ప్రసాదిస్తు వున్న వాతావరణం స్వాతంత్ర్య వాతావరణం. స్వాతంత్ర్యాన్ని తనివితీరా ఆస్వాదించాలన్న ఇతర్ల భావాలపట్ల సహనతనుచూపు. పైపై వాతావరణం ఎలాగున్నా మానవుడు అహోరాత్రాలు తనలో వాంఛించేది లోపల సుఖం, లోపల శాంతి. ఇదంతా మాయకాదు. భ్రమకాదు. ఈ రహస్యాన్ని అవగాహనం చేసుకొనడానికి మనజాతిన్ని తెలుసుకోనాలి. ఇరుగు పొరుగులవారి మనోభావాల్ని అర్థంచేసుకోనాలి. అందరూ వాంఛించేది ఈ స్వాతంత్ర్యాన్నే. ఈ ఆత్మ స్వాతంత్ర్యాన్నే. శతవిధాల దీనిని నిలువబెట్టుకొనడానికే అందమూ వాళ్ల వాళ్ల త్రోవల్లో పనులు కొనసాగిస్తూనే వున్నారు. శిల్పం, నాట్యం, సాహిత్యం, సంగీతం అన్నీ ఈ పనికి ఇచ్చే వూత ఇంతింతని చెప్పతరంకాదు. మన కళా సంపత్తిని గూఢంగా అర్థంచేసుకొన్నామా, మన చుట్టుపక్కల దేశాలవారి తత్త్వాన్ని అతి సులభంగా అవగాహనం చేసుకొనగలుగుతాం. ఇదే ఈ సంస్థ మాకు అహోరాత్రాలు ఇస్తూవున్న సందేశం. ఇదే మా ఆత్మశాంతికి తారకమంత్రంగా చేసినపని. వివరించడానికి మొదలు బెట్టితినా ... ఆ సంగతిని వుత్తమాటలతో ఎలా వివరించగలుగుతాను ? ఇదే మాకు నూతన జన్మను ప్రసాదించింది. విశాల దృష్టితో మా దేశాన్ని చూడడానికి అవకాశ భాగ్యాన్ని ప్రసాదించింది. ఈ సంగతి ఇతరులకు మాటలతో చెప్పనక్కరలేదు. వాళ్ళకే ఈ సంగతి బాగా తెలుసు. సభ్యులు తమ పనుల్ని నిర్విఘ్నంగా కొనసాగించడానికి చూపిన శ్రద్ధ అతీతం. మా ఇంట్లోవున్న యువకులందరమూ ఈ వుద్యమంపట్ల చూపిన వుత్సాహం చెప్పతరం కాదు. ఆ సంగతిని తలుస్తూవుంటే నాకే ఎన్నో సార్లు ఆశ్చర్యం కలిగింది.

ఆ కాలం మంచిదికాదు. మా ఆశయాల్ని నిలువబెట్టుకొనడానికి అహోరాత్రాలు వేయికళ్ళతో మా పరిసరాల్ని చూస్తూ వుండాలసివచ్చింది. వేయి చెవులతో చుట్టుపట్లా జరిగే విషయాల్ని తెలుసుకొంటూ వుండాలసివచ్చింది. అలా చేయడం కష్టం. కాని అట్టి కష్టాల్ని సంతోషంతో భరించకపోతే ఈ జీవిత రథాన్ని యీ విషమావస్థలో సక్రమంగా నడపడం అంత సులభమా ? నువు చేయబోయేపని భగవానునిది. ఆయనే దీన్ని నీకిచ్చాడు. అంచేత అది మహోత్తమమైంది. దాన్నే అర్థంచేసుకొని, కార్యరంగానికి రాగలిగితివా దాని మూలంగా నీ దేశం బాగుపడుతుంది. లోకమూ బాగుపడుతుంది. ఆ పనిని సాధించడానికి కష్టపడాలి. పెనుభూతాల్ని ఎదుర్కోనాలి. వాటితో హోరాహోరిగా పోరాడాలి. ఆ పోరాడంలో నువ్వు ఖైదీవి అయిపోవచ్చు. వాళ్లే నిన్ను హతంచేయవచ్చు. ఆ పనికా నువ్వు గాభరపడడం ? నువ్వుపోతే పోవచ్చు. కాని నీ త్యాగం మూలాన ఇతర్లు ఇప్పుడు కాకపోయినా తరువాత ఈ స్వాతంత్ర్యానుభూతిని తనివితీరా అనుభవించగలుగుతారు. అంతవరకు నీవు నీ విధ్యుక్త ధర్మాన్ని సర్వావస్థల్లో నెరవేర్చడానికి బద్ధకంకణుడవై వుండాలి. ఈ కార్యాన్ని సాధించడానికి వుపయోగించే దినాలే దినాలు. అవి పర్వదినాలు. ఇట్టి సుదినాల్లో స్వాతంత్ర్య దేవతను

ఆరాధించడానికి అవకాశ భాగ్యం దొరికినందుకు గర్వపడు. ఆనందించు. ఈ ఆరాధనకాలంలో నీవు ఎట్టి త్యాగాన్ని చేయడానికైనా సిద్ధంగా వుండాలి.

ఇదే ఈ యువకోద్యమం మాకు ప్రసాదించిన భాగ్యం. మా పనిపాటల్ని చూచుకొంటూ మేము పాడేపాట ఈ సందేశాన్నే మాకు సర్వావస్థల్లో ఇచ్చింది:

''జాగ్రత్త! జాగ్రత్త! జాగ్రత్త!
కాలచక్రం చప్పుడు చేస్తోంది.
దూళిదుమారాన్ని విసరుతూవుంది.
ఒక నిమిషం కళ్లు మూసుకో,
ఒక క్షణం చెవుల్ని గట్టిగా మూసుకో
అలాచేస్తేనీవా ఎక్కడలేని శక్తివస్తుంది
దాంతో ధన్యుడవవుతావు
నువు చేయాలసిన పని సులభమను
కొన్నావా?
దాన్నే తెలుసుకో,
దాన్నే నిలువ బెట్టడానికి ముదంజ
వేయాలి
ఇదే నీ బాధ్యత,
రాత్రింబగళ్లు దాన్నే మననం చేయాలి,
ఎగడు దిగుళ్లు వున్నాయి,
వాటిని దాటడానికి సాహసించాలి
ఇటు నిప్పులు, అటు నిప్పులు
దోవనిండా అగ్నిజ్వాలలు,
వాటిని దాటి ముందుకు నడు,
జయంనీదే,
నీమూలంగా నీజాతి జయిస్తుంది,
లోకమూ జయిస్తుంది,
ముందుకు సాహసంతో నడు,
అదే నీ బాధ్యత
దాన్నే అర్థం చేసుకో
నడు, ముందుకు నడు.''

ఈ పాటను పాడుతూ వుంటే మాకు ఎక్కడలేని శక్తి వచ్చింది. దాంతో మా కర్తవ్యాన్ని శాయ శక్తులా కొనసాగించడానికి ముందుకు నడిచాము.

ప్రభుత్వానికి తెలుసు ఈ శక్తి ఏ రూపాన ప్రజా లోకపు తత్వాన్నే పూర్తిగా మార్చి వేస్తుందని. ప్రజాలోకం అలా మారిపోయిందా ఇంకేముంది? ప్రభుత్వం తన ప్లాన్లని కార్యాచరణలో పెట్టడానికి ఎలావీలుంటుంది? ఇక నాజీ ముఠా సంగతి చెప్పటం అనవసరం! వాళ్లు ఇంతకాలంనుంచి అతి జాగ్రత్తతో నిర్మించుతూ వస్తూవున్న రాజమార్గం అడవి మార్గంగా మారిపోవడానికి ఏ మాత్రమూ సందేహం వుండదు. అంచేత ఇరుపక్షాలవారూ - ప్రభుత్వం ఒక ప్రక్క నాజీనాయకులు మరొక ప్రక్క—వాళ్లకు అందుబాటులోవున్న సామ దాన భేదాలను విచ్చల విడిగా వుపయోగిస్తూ ఈ కొత్త శక్తినే ఆమూలా గ్రంగా పెకలించి వేయడానికి అవలంబించాలసిన పద్ధతులన్నిటిని యథేచ్ఛగా వుపయోగించాలి.

ఈ వుద్యమంలో, ప్రత్యక్షంగా గాని పరోక్షంగా గాని సంబంధం వున్నవారు ఆరోజుల్లో పడ్డ యమ యాతనం చెప్పడం అనవసరం. ఎంతో మంది జైళ్లలో కాలంగడపాలసి వచ్చింది. మరికొంతమంది మాయమై పోయారు. ఆ ఉద్యమమునకు సంబంధించిన పుస్తక ములు అగ్నిపాలయ్యాయి. కార్యాలయాలు మన్ను పాలయ్యాయి. ఇంకా ఎంతో చెప్పరానంత గొడవ జరిగింది. ఇలా చేస్తే ప్రజలు తమ దోవలోకి రాగలరనీ తమ ఏక చక్రాధిపత్యం నిర్విఘ్నంగా కొనసాగ గలుగుతుందని నాజీలు మురిసి పోయారు........

ఈ తుపాను సంవత్సరం పైగా దేశమంతటా చెలరేగి పోయింది......ప్రజలు అలసిపోయారు.

ఒకవైపు యుద్ధం ప్రజలని పీల్చి పిప్పి చేస్తున్నది. మరొక వైపు ప్రభుత్వం జనాంగానికి పెట్టే బాధలను ఇక చెప్పాలా? ... అంతా అలసి సొలసి పోయారు. తాము పెట్టిన బాధలమూలంగా ఈ ఉద్యమంలో పాల్గొంటూ వున్నవారు పశ్చాత్తాప పడ్డారనే భావంతో వారిని ప్రభుత్వం జైళ్లలోనుంచి విడుదల చేసింది. ఈ యువకులు తమ పనులకి సహాయ భూతులుగా వుండగలరని అను కొన్నది ప్రభుత్వం. నాజీలుకూడా ఇక ఫరవా లేదని వుబ్బి తబ్బిబ్బయి పోయారు.........,..

కాని ఈ శక్తిని మార్చడానికి మనతరమా? యువకులు జైళ్లలోనుంచి బయటికి వచ్చినా వారి మనోభావాలు ఎలా మారగలుగుతాయి?

హాన్స్ ఇలా జైలుకు వెళ్లి వచ్చినవాడే. జైళ్లలో అష్టకష్టాల్ని అనుభవించినవాడే. ఇకముందు ఏం చేయాలి? హైస్కూలు చదువు పూర్తి అయింది. విశ్వవిద్యాలయంలో చేరాలి. తన మనో భావాల్ని కార్యరూపాన నుంచడానికి ఎట్టి చదువు చదివితే మంచిది? ఇదే హాన్స్‌ని కలవరపెడుతూ వున్న సమస్య... ఇతరులకు సర్వావస్థల్లో సహాయంగా ఉండడానికి డాక్టరు పరీక్షకు చదవడం మంచిదని హాన్స్ నిశ్చయించుకొన్నాడు. వైద్య విద్య సామాన్యమయిందా? ఇతర విద్యలకు మల్లె ఏమూడు నాలుగు సంవత్సరాల్లో ముగిసే చదువుగాదు. దానిని సక్రమంగా పూర్తిచేయడానికి అధమం ఏడు సంవత్సరాలకు పైగా కష్టపడి చదవాలి........

(సశేషం)

# నారీ విశిష్టత

శ్రీమతి వాశిరెడ్డి సుశీలాదేవి

నేటి సమాజములో నాగరీకులు అనుకొనేవారిలోను సామాన్యులలోను స్త్రీ అంటే దాసి అనిన్నీ, తమకు కేవలము సంతానము కనే యంత్రముగా భావించువారు కొందరుకలరు. ''నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి'' అనిపేర్కొంటారు. ఈ హేతువులన్నియు చాల అసమంజసములనియు, చారిత్రక పరిశోధనా విహీనములనియు, బుద్ధిమాంద్య అసూయా వికారములనియు, తెలుసుకొనుట మంచిది.

మన పూర్వ గ్రంధములయందే శ్రీమద్రామాయణమందు శ్రీ రాముడు పితృవాక్య పరిపాలనకై అరణ్యవాసము చేయబోవునపుడు సీతను అనుజ్ఞ అడుగగా, 'రామా! సర్వము తెలిసినవాడవు. పురుషుడుగా తనయొక్క ధర్మమును నిర్వర్తించినవాడే పురుషుడగునుచి. వాహకాలమందు మా తండ్రి నీవు పూర్ణ పురుషుడవనియు, యెల్లకాలములయందు నన్ను నీతో సమానముగా చూచుకొందువనియు, నీ ధర్మమును నిర్వర్తించెదవనియు, నన్ను నీకర్పించియున్నాడు. నేను వేరుకాదు–నీ అర్ధాంగిని. కనుక నన్ను వీడినచో నీవు పూర్ణ పురుషుడవు కాజాలవు. సతీపతీ సమైక్యతయే పూర్ణ పురుష లక్షణము. కావున నీతో నేనరణ్యమునకు తప్పక వచ్చెద'నని అన్నది. ఇంతియేగాక మహాభారతములో పాండవపత్ని అనేక కష్ట సమయములందు, తన పతులకు హితోపదేశములుచేసి కార్య తత్పరులను, ధర్మ నిరతులను చేయగలిగినది. ఇట్టివారు విద్యా వివేక విహీనులా? స్వాతంత్ర్య రహితులా? పురుషుడు గృహాధిపతి కావలెనన్నను, రాజ్యాధిపతి కావలెనన్నను యజ్ఞయాగాది సత్కర్మలు చేయవలెనన్నను పత్నీ రహితుడగుచో, అతడు విధురుడనబడును. దీనిని బట్టి మనము తెలుసుకొనవలసిన దేమనగా స్వాతంత్ర్య ఫలము స్త్రీ పురుషులకు సమానమే. ఇట్టివి మన వేద పురాణ యితిహాసాదులయందును ప్రత్యేక రాజాస్థాన చరిత్రలయందును, సామాన్య కథలయందును ఉదాహరణములు పెక్కులు గలవు.

పత్నీధర్మములు:–శ్లో॥ కార్యేషుదాసీ – స్త్రీ తన గృహకృత్యములను నిర్వ

హించుటయందు దాసివలెనే పని చేయునుకానీ అంత మాత్రముచేత దాసి కాజాలదు. అట్లైన గృహకృత్యములందు పాల్గొన్న పురుషుడు కూడా దాసుడు అగును. కార్యములు చేయుటయందు సేవకురాలివలె పని చేయవలెననియేకాని పనిచేసినంత మాత్రముచేత సేవకురాలు కాజాలదు.

కరణేషుమంత్రి:–ఇంద్రియాదుల జయించుటయందు జ్ఞానబోధ చేయునట్టిదనియు, సుఖదుఃఖమయమైన సంసార రాజ్యమును నడుపుటయందు ఉపాయములనుచెప్పి తన భర్తకు సహాయపడుటయందు మంత్రివంటిదనియు.

రూపేచలక్ష్మీ:–రూపమునందు స్త్రీ మంగళప్రదములైన అలంకరణములతోను, ఉల్లాసముతోను, తేజోవంతమైన రూపమునుగలిగి లక్ష్మీప్రదురాలై యుండును. స్వాతంత్ర్యములేని స్త్రీ ఎట్లు సంతోషవతియగును ?

క్షమయాధరిత్రిన్:–కష్టమును సహించుటయందు భూదేవివంటిది. చిన్న బిడ్డలను పెద్దవారినిగ చేయుటయొక్క బాధ్యత కేవలము స్త్రీలదే. ఇట్టిది పురుషులకున్న విదేశయానమునకో కాశీయాత్రకో బయలుదేరగలరని చెప్పగలను. సామాన్యులు కొందరు స్త్రీయే కష్టపడుచుండవలెననియు గృహకృత్యములందు ఎంత మాత్రము తమకు బాధ్యతలేదనియు తలంచుట శుద్ధ అవివేకము. సంసార శకటమును యీడ్చుటయందు స్త్రీ పురుషులు యిరువురును సమానమగు వృషభములు.

భోజ్యేషుమాతా:–అన్న పానాదులు తల్లివలె ప్రేమతో దయతో ఒసంగి సంతృప్తిపరచునదియని అర్థము. అంతియేగాని రొఖ్ఖమును తీసికొని నేటి పూటకూళ్లయ్యలు యెంగిలి మెతుకులు పెట్టి సంతృప్తిపరచుటవంటిది కాదు.

శయనేషురంభ:–పడకయందు తన భర్తకు నిత్యము ఆహ్లాదమును కలుగజేయుటయందు నూత్న రీతులతో ప్రవర్తించుట భారతవనిత ధర్మములని చెప్పబడును. విద్యావతియు, వివేకవతియు అయిన ఆర్యవనిత మూర్ఖులు భావించినట్లు తలంచినయెడల పై ధర్మములను ఎట్లు ఆచరించగలదు ?

ప్రస్తుతము హిందూ సంఘము బాగుపడవలెనన్నచో విద్యావతియు, వివేకవతియు, ఆరోగ్యవతియు, స్వాతంత్ర్యవతియునగు స్త్రీలు లేనిచో సంఘము అభివృద్ధినొందుటకు బదులు క్షీణదశనొందును. ఇప్పుడిపుడు భారతనారీమణులలో కదలిక

[1331 పేజీ చూడుడు]

# తృష్ణ ముళ్లు

శ్రీ 'విజయ - రాఘవ'



(గతసంచిక తరువాయి)

"మల్లిఖార్జునరావుగారూ! యిదంతా మా భ్రమగాని, మరేముంది చెప్పండి. చాలా శ్రమ కలిగించా. మీ రటువంటివారు కాదని 'మాట వరుసకి యినస్పెక్టర్ గారితో అన్నాను. కాని డ్యూటీ గదండీ! తప్పుతుందా! చేసినట్లు ఒక రిపోర్టు కూడా పంపాలిగదా! అందువల్ల వచ్చాం.' మీకు అనవసరంగా శ్రమ కలిగించినందుకు వేరుగా అనుకోకండి. వెళ్లొస్తాం" అంటూ నెత్తిమీద టోపీ పెట్టుకొని, సాల్యూట్ చేసి గది మెట్లుదిగి వెడుతుంటే, మెట్లమీద నిలుచుండి మల్లిఖార్జునరావు - "అయితే వుంటాసార్" అని గదిలోకివచ్చి, తలుపులుమూసి, తీసిపారవేద్దామన్నా తీయడానికి వీలుగాని అపవాదు యిలా వచ్చిందేమి!" అని ఆలోచిస్తూ పడుకొన్నాడు.

ఈ పోలీసువాళ్ళు రావడం, మల్లిఖార్జునరావు, కానిస్టేబుల్ కలిసి వేరుగాపోయి మాట్లాడుకోవడం, తరువాత వచ్చి రూం అంతా సోదా చేయడం, తరువాత కానిస్టేబుల్ అన్న ఆఖరి మాటలు, యీ తతంగమంతా పరిశీలిస్తున్న స్నేహితుడుకి అంతా అయోమయంగావుంది. అంధకారంలో పాతాళ లోకం కనిపిస్తున్నట్లుంది.

"దేనికండీ వచ్చారు వీళ్ళంతా" - స్నేహితుడు వుండబట్టలేక అడిగాడు. మల్లిఖార్జునరావేమని సమాధానం యిస్తాడు. మళ్ళా కొరడాపెట్టి కొట్టినట్లయింది. మొగమంతా జీవురు మంటోంది. "తరువాత నెమ్మదిగా చెప్తాలెండి" అని మల్లిఖార్జునరావు గోడ ప్రక్కకు తిరిగి పడుకొని బీడీకాలుస్తూ సరోజినిని గురించి ఆలోచిస్తూ - కన్ను రెప్పలకి నిద్ర నంటించాడు.

7

గొల్లపల్లిలో బ్రహ్మాజీరావు యింటిముందు ఒక కమ్మవారి కుటుంబంవుంది. ఒకానొకప్పుడు ఒకరికొకరు చాలా సన్నిహితంగా వుంటూవచ్చినవారే. రోజులు మారుతున్నకొద్దీ బుద్ధులు మారుతూండటం జరుగుతోంది. మొదట్నించి సత్యవతి - సరోజిని - రావమ్మ ఒకే తరగతిలో వుండటంబట్టి, వారంటే ప్రతివారూ చాలా వరకు జాగ్రత్తగానే వుంటూ వుంటారు. సత్యవతి - సరోజినులకు చేతిస్వతంత్రతనం వుంది. చిన్నతనంలో పుట్టిన బుద్ధిని అప్పుడే మొదట్లోనే తుంచినట్లయితే యీ నాడు యింత అఘాయిత్యానికి కారకురాలు కాకుండాపోయేది. కడసారి కూతురవడం - గారాబాల మొలకవడంతో - గౌరవమర్యాదలకు గంధకం పూత వేస్తోంది. సరోజిని సత్యవతుల్లో ఎవరు గొప్పని నిర్ణయించడానికి మనమెవరం? బహుశా! వూహించినా తప్పేనంటా నన్నడిగితే. ఎందుకంటే యీ ప్రపంచంలో యింతో, అంతో జ్ఞానమార్జించుకొని, కాలాన్ని వెళ్ళబుచ్చుకొంటున్న వాళ్ళం. యీ నాడు వాళ్ళిద్దర్నీ గురించి కాలయాపనచేస్తూ, ఆలోచించడానికి ఉద్యమించామంటే కేవలం కొరివితో నెత్తిగోక్కున్నట్లవుతుంది. ఎడారిలో గుడారంవదిలి ఎండమావులకోసం, గుండెకు రాయి కట్టుకొని తిరగటం అవుతుంది.

"ఆ కమ్మవారు వున్నట్టుండి కట్టకట్టుకొని అంతా పెళ్ళికెళ్లారు. సరోజిని ఆ సమయంలో వాళ్ళింటి పాలేరుతో యేయేమంత నాలాడిందో పెరుమాళ్ళకెరుక. తెల్లవారేటప్పటికి పెళ్ళి కెళ్ళినవారు తిరిగివచ్చి

యిల్లు చూసుకొంటే యేముంది? గుల్లగా తయారయివుంది. లబాయిలు దిబాయిలు, ఏడుపులు - పెడబొబ్బలు. నెమ్మదిమీద యోచనచేసి, యెలాగైతేనేం విషయాన్నంతా ఆకళింపుచేసుకొని పోలీసు రిపోర్టుచేయడం - వాళ్లొచ్చి, బ్రహ్మాజీరావు యిల్లు సోదాచేయడం, సరోజినివున్న గదిలోనే పోయిన వస్తువులు దొరకడం జరిగింది. వస్తువులు దొరకటం వల్ల కేసుకు బలం బాగా వచ్చింది. సరోజిని యీ రాద్ధాంతానికి కారకురాలని నిశ్చయించారు. ఇంత హంగామా జరిగిన సమయంలో బ్రహ్మాజీరావు యెక్కడో హాయిగా అమాయకుల దగ్గర డబ్బాలు కొడుతున్నాడు. వూళ్ళో అయితే లేడని కచ్చితంగా తేలిపోయింది. తీరా కారుదిగి యింటికొచ్చేటప్పటికి సరోజిని యెరగనట్టువుంది. ఆ సాయంత్రం మామూలుగా పోసుకోలు కబుర్లరాయళ్ళంతా రావిచెట్టు అరుగుమీద కూర్చొని మాట్లాడుతూండగా - సరోజినిచేసిన అఘాయిత్యం కాస్త కాస్తగా బయలుకు రాసాగింది. బ్రహ్మాజీరావు సాంతం సానుకూలంగావిని నివ్వెరపోయాడు. తన యెడమకాలి చెప్పుతో తనను ఎవరో తీర్చి కొట్టినట్లుగావుంది. వేయి శూలాలతో వొళ్ళంతా పొడుచినట్లు బాధపడసాగాడు. ఏంచేస్తాడు. నోటమాటలేదు. ప్రొద్దుకూకిపోయింది. తిండి తిప్పలకు యెవరికివాళ్ళు లేచి వెళ్ళిపోతున్నారు. పంచె దులుపుకొంటూ బ్రహ్మాజీరావులేచి, కాళ్లీడ్చుకొంటూ యింటి ముఖం పట్టాడు. సరోజిని వంట చేస్తోంది. బ్రహ్మాజీరావుకి యేమని ప్రశ్నించి, యీ విషయంలో నిజానిజాలు తెలుసుకోవాలో అగమ్యగోచరంగావుంది. అందులో గౌరవంగా బ్రతికినవ్యక్తి ఒకప్పుడు. చూస్తూ, చూస్తూ తనేవిధంగా అప్రతిష్ఠలకులోనయిపోతున్నాడో వూహించుకోనవసరంలేకుండానే చర్యలన్నీ చత్వారం వచ్చిన కళ్ళకే - స్పష్టంగా కనబడుతుంటే, వేరే తనెందుకు సులోచనాలకోసం బాధపడాలి. అయినా సరోజినిని అడిగి తెలుసుకోవాలని అనుకొన్నాడు.

"సరోజినీ! యేమిటిదంతా! వూరంతా కోడై యేమని కూస్తోందో విన్నావా!"

"అనుకుంటే అనుకుందిలే. నాకేమన్నా భయమా! యెవర్ని గురించి యేమనుకోకుండా యెవరూరుకొంటారు. అయినా వాళ్ళు చూసారా నేతీయడం"-

"తీయకపోతే యీ అభాండం యింత తేలిగ్గా మనమీద యెందుకు వేస్తారు. పోనీ వాళ్ళకేమైనా సరదా అనడానికి."

"సరదో - గిరదో నాకేం తెలియదు. నేనెటువంటిదాన్నో నీకు తెలియదా!"

"తెలుసు. కాని, చీరలు - నగలూ మనింట్లో యీ గదిలోనే దొరికాయటగా!"

"నాకు తెలియకుండావస్తే రాకూడదా! నేనే నూతికి. గోతికి పోయినప్పుడో, వాళ్ళ పాలేరువాడు యీ పనిచేస్తే, చేయకూడదా! అయినా, వాళ్లు మాత్రం పెట్టెలకు తాళాలు వెయ్యకుండా పెళ్ళికి పోవడంయేమిటి? ఖరీదైన వస్తువు కంటబడితే, కావాలని తీసుకోకుండా యెవరుంటారు యీ రోజుల్లో.

"కంటబడితే బుద్ధి గడ్డితినాలుందేమిటి?"

"గడ్డితినకుండా కాలం వెళ్ళబుచ్చుతున్న వాళ్లెవరేమిటి?"

"మనిషి జన్మెత్తిం తరువాత బుద్ధి వుండాలి. వెధవ సమాధానాలు చెప్పినంత మాత్రాన అది సరిపోదు. అదేదో తెలివనుకుంటున్నావ్ గాని. నిజంగా యింత అపవాదు, నేను బ్రతికివుండగా తెచ్చి నా నెత్తిమీద కిరీటంగా పెట్టావంటే, యింకేమనుకోవాలి. నా పరువు ప్రతిష్ఠలు మట్టిలో కలిపావు. వీధిలో తలెత్తుకోనీయకుండా చేసావ్! నలుగురిలో నా మాటకు చలామణీ లేకుండా చేసావ్. పదిమందిలో కూర్చొంటానికి, వాళ్ళతో కలిసి తిరగడానికి ఆస్కారంలేకుండా చేసావ్. చిన్నప్పుడే - మీ అమ్మ బ్రతికివున్నప్పుడే నీ బుద్ధి నాకర్థమయింది. ఆయేడు

"తూ" అని పుసిక్కున వూసేవాళ్ళేగా! అయినా తుమ్మ వల్ల ప్రయోజనం లేదనిగాదు. ప్రకృతిలో ప్రయోజనం లేని వస్తువులేదు. తుమ్మలంటే జ్ఞాపకం వస్తుంది పాతసామెత ఒకటి. ఒక్కొక్కసారి మన పెద్దవాళ్ళు ఎవరినన్నా తిట్టుతున్నప్పుడు, అక్కడక్కడా ముద్దుముద్దుగా, "ముచ్చటగా నీ మొహమేగా! నాయనా! తుమ్మల్లో ప్రొద్దుకూకినట్టుంది." అని అంటూంటారు. మూడు సంవత్సరాల్లో మేకలు తినకుండా ఆ తుమ్మలెలాగైతేనేం పెద్దవైనాయి. క్రింద కొమ్మల్ని నరికి సుబ్బారావు రెండో కొడుకు యింటికిచుట్టూ కంచె వేస్తూ వస్తున్నాడు. బ్రహ్మాజీరావు స్తలంల్లో చెట్లు అలాగే వున్నాయి. సుబ్బరావు కున్నంత పెరడు దొడ్డి; రంగారావుకి లేదు. సత్యవతికి కడుపు కాలుకుపోతుండేది, సుబ్బారావు పెరటిదొడ్లో కూరగాయిలు — పూల మొక్కల్ని చూచినప్పుడల్లా. చీటికి మాటికి వచ్చినప్పుడల్లా సత్యవతికి కన్నుకొట్టి, యేం మాట్లాడాలో తెలియక- "అక్కాయ్! మీరేనయమే! చక్కగా దొడ్లో పాదులన్నీ పెట్టావ్. మాకూ స్తలమున్నదన్న మాటేగాని, యేంలాభం. పెట్టుకొని పెంచుకొనే దశ వుండొద్దు. మీరేనయం - మీరేనయం" అని పదే పదే దొడ్డంతా తిరుగుతూ, చుప్పనాతి సూడిలాగా మాట్లాడుతూంటే, అలివేలమంగకి అంతరాంతరాల అఘాతంలోంచి ఆవేశాన్ని, ఎవరో గొట్టాలు పెట్టి విద్యుచ్ఛక్తితో, తోడినట్లుగా వుండేది. "అవేం మాటలే ... మరీను. అల్లా అంటావ్. నీకూ స్థలముందిగా - నువ్వూ పెట్టుకోగూడదా" అంటే అనవసరంగా దాన్ని బాధపెట్టినదాన్ని అవుతానేమో అని అభిమానం ఒకటి పీడిస్తోంది. "చూసావా! చూస్తూ, చూస్తూ అక్కయ్యాని చనువుగా మాట్లాడితే, నిర్మొహమాటంగా పుటిక్కున మొహాన అనేసింది" అని యెక్కడ క్రుంగిపోతుందో అని భయపడేది. అలివేలమంగ కొడుకులచేత దొడ్డికి కంపవేయించుకొనేది. యింత బందోబస్తు సత్యవతి స్థలానికి లేదు. వున్న కాస్తలో పూల మొక్కలు పెట్టింది. సుబ్బారావు యింటిముందు పూలమొక్కలు కొడుకుల పోషణవల్ల కంటికి విందొనరస్తుంటే, తనకెందుకలా చేయలేనని, పోటీగా చేసిన కృత్యమని నోరు చెప్పక పోయినా స్వయంగా, చేతల్లో నగ్నసత్యం బయట పడకుండా యెన్నాళ్లు దాగివుంటుంది. సమయాసమయ విచక్షణాజ్ఞానం లేకపోతేనూ, చిన్నా-పెద్దా, తారతమ్యత లేకుండా నోటికిష్టమొచ్చినట్టు అభమూ-శుభమూ యెరుగకుండా వాగుతున్నప్పుడు అయిన వాళ్లు మాత్రం చూస్తూ యెలా వూరుకోగలరు! అలివేలమంగంటే, రక్తసంబంధమైన అక్కగారు. చిన్నతనంలోనే అవగాహనైనబుద్ధి. అందువలన "చెల్లెలు" అనే పదం హృదయంలో తళుక్కుమన్నప్పుడు సత్యవతి నోరుచేసుకొన్నా యేం అనుకునేదిగాదు.

9

సరోజినిని యీనాడు కాపురానికి పంపితే తనకు ఒండిపెట్టేవాళ్లు ఎవరూ వుండరని బ్రహ్మాజీరావు పరిపరి విధాలుగా ఆలోచిస్తూనే వున్నాడు. ఎన్నాళ్ళని పెళ్ళయిన పిల్లని తిరిగి కాపురానికి పంపకుండా వుంటాడు. యిప్పటికే లోకులు పలుకాకుల్లాగా కూస్తుంటే, తను స్వయంగా వింటూ యేం చెయ్యలేక పోతున్నాడు. ఎలాగో పంపేద్దామనే ధృఢనిశ్చయుడయ్యాడు. సరోజిని తిరిగి కాపురానికి వెళ్ళిందని పదిమంది అమ్మలక్కలు అనుకొన్నారు. మహా అయితే యే రెండు మూడు నెలలు మొదటిసారి అత్తవారింట కాపురం యెలగ పెట్టింది; అప్పట్లోనే మల్లిఖార్జునరావు ట్రైనింగ్ చదవడానికి వెళ్ళింది. మల్లిఖార్జునరావు చాలా రోజులు బాగా ఆలోచించే ట్రైనింగ్‌లో చేరింది. బ్రహ్మాజీరావు చాలా ఆశలు చూపాడు, మల్లిఖార్జునరావు ట్రైనింగ్‌లో చేరకముందు. ఆ వుద్యోగం యిప్పిస్తా, యీ వుద్యోగం యిప్పిస్తా, అందులో నాకు తెలిసిన వాళ్లున్నారు, యిందులో వున్నారని బూటకపు మాటలతో పేకమేడలు కట్టడంలోగల అంతరార్థం గ్రహించి, తనకీయన మొండిచెయ్యి చూపుతున్నాడని తెలుసుకొని, బృహస్పతి తెలివితేటలుపయోగించి ట్రైనింగులోకిచేరాడు. తన అల్లుడు పనికిమాలిన ట్రైనింగు చదువుతున్నాడని బ్రహ్మాజీరావు ఒక

రిద్దరు పుత్రి పత్నులతో అన్నాడు. అంతటితో పూరుకోక తనకు తీరని అవమానంగాకూడా వుందన్నాడు. "ఫలానా బ్రహ్మాజీరావు అల్లుడు టైప్రినింగ్ చదువుతున్నాడంటే తనెంత సిగ్గుపడి చావాలి. ఇంత గౌరవంగా బ్రతికిన బ్రహ్మాజీరావు, కూతుర్నిచ్చి పెళ్ళిచేసి కావాలని తెచ్చుకొన్న అలుడు మల్లిఖార్జునరావుకి వుద్యోగం సంపాదించి పెట్టలేకపోయాడే అనే అప్రతిష్ఠ తనకురాదూ! యిలా అప్రతిష్ఠ వస్తుందని మల్లిఖార్జునరావు యిసుమంతైనా గ్రహించలేకపోయాడే! ఎంత తెలివి తక్కువవాడు" అని ఖేదపడిన రోజులు బ్రహ్మాజీరావు బ్రతుకు చిట్టాలో ఎర్ర సిరాతో అండర్ లైను చేసేవున్నాయి.

బ్రహ్మాజీరావు చేసిన పనులన్నీ ప్రసాదరావుకి ఆలోచిద్దామన్నా పాలుపోకుండా తయారైనవి. ప్రసాదరావును అతని బంధువులేగాదు, అతని మొగం చూసిన ప్రతివాడు యింతో అంతో గౌరవం - ప్రేమ చూపించకుండా వుండలేడు. ప్రసాదరావు ఎన్నో విధాలుగా గొల్లపల్లి యెస్టేటును పతనాలకు గురికాకుండా కాపాడుకొంటూ వచ్చాడు. యెన్నో ఘనకార్యాలుచేస్తూ దాని ఘనతను నిలబెడుతూ వచ్చాడు. యీ నాటికి గొల్లపల్లి యెస్టేటు జమిందారు బంధువులేగాని, ఆయన కూతుళ్ళుగాని ప్రసాదరావు పేరు రోజుకి ఒక సారైనా స్మరించకుండా వుండలేరు. ప్రసాదరావు యెంత దూర్వాసమహామునో, ఆయన భార్య నరసమ్మ అంత శాంత స్వభావురాలు. "అన్నపూర్ణ" అనికూడా నిస్సంకోచంగా అనొచ్చు. ఎప్పుడు వెళ్ళినా అతిథులకు అడ్డులేదు. శక్తివంచనలేకుండా ఒక్కచేతిమీద చేసిపెట్టే మనిషి. చిరునవ్వులతో ఆహ్వాన వీడ్కోలు జరుపుతూండేది. యీ నాటికి ప్రసాదరావు సంసారాన్ని వేనోళ్ళ పొగడుతున్న ఛత్రాజులు - గొల్ల భాగవతులు కనిపిస్తూనేవుంటారు. ప్రసాదరావుకి యిద్దరు మొగపిల్లలు, యిద్దరాడ పిల్లలు. ప్రసాదరావు, నరసమ్మ కలిసి పెద్దపిల్ల చిట్టిని సుబ్బారావు పెద్దకొడుక్కిచ్చి వివాహం చేయాలనుకొన్నారు. కాని యిద్దరికీ ఒకే వయసులో వివాహంచేయడం యేంబాగుంటుందని అభిప్రాయాన్ని మార్చుకొన్నారు. చిట్టిని పరాయిగా వేరే సంబంధంచూసి పెళ్ళిచేసారు. యిస్తానని యెగగొట్టాడని సుబ్బారావు యేమాత్రం చింతించలేదు. బాధపడలేదు. చివరకు గొనగనూలేదు. కాని చిట్టెమ్మ వివాహానంతరం పెద్ద కొడుకు వివాహంచేసిన మరు క్షణంలోనే నరసమ్మ స్వర్గస్తురాలయింది. యీ చావు రాబోతోందని యేమైనా వూహించదేమో మరి ఆ పతివ్రత నరసమ్మ. ఒకనాటి వుదయం పెద్ద కొడుకు పెళ్ళిలో సుబ్బారావు దంపతుల్ని చేరబిలిచి ప్రసాదరావుకూడా అక్కడే వున్నాడు. వంటయింటిముందు పందిట్లో కూర్చోపెట్టి - నరసమ్మ -,

"సుబ్బారావూ! - యేం అనుకోకుండా వుంటానంటే, ఒక మాట చెబుదామనుకొంటున్నా. మరి మీ బావకూడా యేమంటారో కనుక్కోవాలిగా"- అంది.

సుబ్బారావు దంపతులు సౌమ్యంగా—

"అనుకునేదేముంది అక్కయ్యా! చెప్పదల్చుకొన్నదేమిటో చెప్పండి" - అన్నారు.

నరసమ్మ పమిటచెంగు ముడివేస్తూ - "యేమీలేదు. చిట్టినిద్దామని అనుకున్నాం. కాని అది జరగకుండాపోయింది. దాన్ని గురించి యిప్పుడా విషయం అనవసరంకూడా. ఎలాగైనా యీ సారి మీతో వియ్యమొందాలని, సంబంధ బాంధవ్యాలు యిదివరకటికన్నా యెక్కువ చేసుకోవాలనివుంది. నా రెండో అమ్మాయిని మీ వాడికిచ్చి సలక్షణంగా వివాహం చెయ్యాలనివుంది. మీ అన్నయ్యకికూడా యిష్టమేననుకుంటా. యీ విషయం మీరుకూడా యిష్టపడినట్లు, యీ పందిట్లోనే వివాహం జరిగేటట్లు "ఊ..." అని వొప్పుకున్నట్లు వాగ్దానం చెయ్యండి" అని చేతిలో చేయివేయించుకొని అమృత ప్రాయంగా మాట్లాడేటప్పటికి సుబ్బారావు దంపతులుకి ఒళ్లు పులకరించిపోయినట్లయింది.

(సశేషము)

# సంపూర్ణ జీవనానికి
# సాధనములు జీవితోద్దేశము

శ్రీమతి నెమలి చంద్రమతిదేవి



జీవితానికి అర్థమేమిటి? అసలు జీవుడెవరు? ఎక్కడనుండి వచ్చినాడు? ఎక్కడికి వెళ్లుతాడు? అను, ఈ ప్రశ్న క్రొత్తదికాదు, యుగయుగముల నుండి వచ్చుచున్నదే. దీనికి సమాధానం ఎంతమంది వెదకుచున్నారో, యెంతమంది వెదికిరో, ఇంకెంత మంది వెదికెదరో, చెప్పుటకు వలనుపడదు.

శృతులు, వేదములు, వుపనిషత్తుల్లో చెప్పబడి యుందిగాని, అదెవరి కర్థమవుతుంది? సామాన్యులకు, అవెంత చదివి బుఱ్ఱ బద్దలు కొట్టుకున్నా అర్థం కాదు, గాని వాటిని అర్థంచేసుకుని, అనుభవించిన మహానుభావులున్నారు. అటువంటి వారే, లోకములో, మానవులకు తెలియుటకుగాను గ్రంథములు వ్రాసియున్నారు, బోధనలు చేసియున్నారు. అనుభవమునకు తెచ్చుకొని, ఆప్రకారము జీవితం గడపినగాని, అర్థమయే సమస్యకాదిది.

భగవద్గీత మొదలగు గ్రంథములు, ఒక్కమాఱు చదివిన అర్థమగు నటువంటివికాదు. చదువను చదువను, దానిలోనిమిడియున్న అంతరార్థం బోధపడగలదు. అప్పుడే గ్రహించుటకు శక్తికలుగుచున్నది.

వారి వారి మనోపక్వ స్థితిని బట్టి వారు వారు గ్రహించుకొనవచ్చును.

మానవ జీవితము సంపూర్ణమైనది. చెట్లు, చేమలు క్రిమి కీటకములు, పశుపక్ష్యాదులు కూడ జీవము కలిగి జీవించుచున్నవి. భగవంతుడొక జీవిని మానవ జన్మవచ్చువఱకు, ప్రకృతి శక్తికి లోబడి జీవించునట్లుగా చేయుచున్నాడు. అటులైన మానవులగా సృష్టించి, వారివారి కర్మస్థితిని వారికే ఒప్పగించినాడు. మీరు మీ బుద్ధిబలము నుపయోగించి, నాలో ఐక్యమైపోయెదరో, లేక ప్రపంచప్రకృతి మాయాశక్తికిలోబడి, తిరిగి, తిరిగి జన్మలు గాంచుచుందురో, అది మీరు, మీకర్మకు లోబడి యుంటారని, మానవులకే వదిలిపెట్టినాడు. ప్రకృతి శక్తికి యెదురు నిలచి, ప్రకృతిని గెలిచినగాని దైవము, దైవశక్తి గోచరముకాదు. ప్రకృతితో పొత్తు కలిగి యుండడం తప్పేనా? అనుకుంటాము. పశువులవలె తిండితిని, తిరుగుచున్న యెడల ప్రకృతితో పొత్తే! అయితే మానవులకు పశువులకు భేధంలేదా? మానవులకు జ్ఞానం ఇచ్చినాడు, తన దైవాంశ మానవులకు ఎక్కువగా నిచ్చియున్నాడు. గనుక జ్ఞానం వలన ధర్మం, సత్యం, తెలుసుకొని, ఈ ప్రపంచం ఒక నాటక రంగం అనుకొని, మాయనుగెలవమన్నారు

జీవితం సుఖదుఃఖములతోకూడినది. వాటి రెంటిని సమంగా, భావించి, ఇంద్రియములను నిగ్రహించి, మనసును లోబఱచుకొన్న వారిని విజయవంతులని, యోగీశ్వరులనెదరు.

సుఖము కలిగినపుడు పొంగిపోక, దుఃఖము కలిగినపుడు కృంగి కృశించిపోక, సంసారము చేయుచుండినను, నీటిలోని తామరాకువలెనుండమన్నారు పెద్దలు. ఇట్లుండకు వీలగునా? అన్న ప్రశ్న వేసిన, ఇట్లుండువారుకూడ యుండిరి. ఇప్పటికిని యున్నారు కొందఱు లేకపోలేదు.

మనము జ్ఞానమును వృద్ధిపొందించుకొనుచు, ఇతరులనుకూడ విజ్ఞానమయులుగ చేయుటకు తోడ్పడుచు, స్వాభిమానములేకయుండుటే, సత్యజీవితము, ధర్మజీవి

తమును. లోకమంతా తానుగా భావించి, ఆనందమును పొందెదరు యోగీశ్వరులు. అదే శాశ్వతానందము. తనకు తాను మాత్రము ఆనందముపొందుట అతిస్వల్ప విషయము. క్షణకాలభంగురము.

ఒక తల్లి కిద్దరు కుమారులున్నారనుకొందాము. ఒక కుమారుడు పరీక్షలో మొదటి తరగతిలో, మొదటివాడుగా పాసవుతాడు. అది విని ఆ తల్లి అమితానందం పొందుతుంది. ఆ మఱునాడే, ఇంకో కొడుకు ఫైలయినాడని తెలుస్తుంది. అప్పుడామె సంతోషం ఎక్కడపోతుందో, దుఃఖపడుతుంది కొంతసేపు, ఆఖరుకి సంతోషాన్ని, దుఃఖాన్నికూడ మర్చిపోతుంది. అప్పుడు ఏదీ ఉండదు. సంతోషాన్ని దుఃఖం తోసి వేస్తుంది. దుఃఖాన్ని సంతోషం తోసి వేస్తుంది. జీవితమంటే ఇదేనా!

ఇట్లు యెన్నో సంఘటనలు మన నిత్య జీవితంలో జరుగుతుంటాయి, గోచరిస్తుంటాయి, వాటిని అర్థం చేసుకొనడమే మనపని.

వారి వారి కేర్పరుపబడిన విధులను నిర్వర్తించుచు, వారి వారి శక్తికొలది తోటి మానవుల కుపయోగపడుచు, సత్యము, శాంతిమయమున సజీవితం గడపుటే, మనవిధి. దాని ఫలాఫలముల జోలి మన కక్కర లేదు. దేవుడు దేవుడని, ఏదితలపెట్టినా, ఆఖరుకి దేవునిక్రింద కేదిగుతుందే, దేవుడనిమాట రాని విషయం, లేనేలేదా? అంటారు కొందఱు - గాని దేవుడులేనిది ఈ బ్రహ్మాండములో, లేనేలేదు. పర్వతము మొదలుకొని, పరమాణువువఱకు, వాటిలో దైవశక్తి (ప్రాణశక్తి) అణగియున్నది - ఆ శక్తివల్లనే, మనము సృష్టింపబడ్డాము. ఆ శక్తివల్లనే పాలింపబడుతున్నాము. దానివల్లనే మాట్లాడుతున్నాము, తిరుగుతున్నాము; పనిచేయుచున్నాము. ఎక్కడయితే, దేవుడులేడనుకుంటామో అది మాయ. ఆమాయాశక్తికూడ దేవునిదేసుమా! అటువంటప్పుడు ఆ సర్వశక్తిమయుని, ఒక క్షణం మఱవగలమా? లేక మఱువవచ్చునా? అది తగనిపనికదూ. అలా మఱచినట్లయితే, ఒక చిన్న దెబ్బకొట్టి లేపుతాడు. అప్పటికి గ్రహించకపోయిన పెద్దదెబ్బే తగిలిస్తాడు. అప్పుడు తెప్పరిల్లుకొని, "ఓయి భగవంతుడా, నన్ను రక్షించు - నిన్నే నమ్ముకున్నాను" అని మొఱపెట్టుకుంటాము. అలాగ ఆపదలొచ్చినప్పుడే తలచుకుంటాము.

"దేహబుద్ధితో నీకు నేను దాసుడను. జీవభావముతో, నీ యంశమైనవాడను. ఆత్మభావముతో, నీవే నేనైతినని," వేదాంత వాక్యము.

ఆహా! ఈ ఒక్క వాక్యములో, సకలమత సారము, నిమిడియున్నది! ఆశ్చర్యము.

---

## భోంచేస్తూ వున్నప్పుడు!

"అమ్మా: నేనో సంగతి చెప్పేసేదా?" అని అబ్బాయి అమ్మని భోంచేస్తూ వున్నప్పుడు అడిగాడు.

"భోజనాలసమయాన పిల్లలు మాట్లాడకూడదు" అని అమ్మకసిరింది.

"ఫరవాలేదు. ఒకే సంగతి. దాన్ని చెప్పాలి" అని వాడు ప్రాధేయపడ్డాడు.

"ఇప్పుడు కాదు. భోంచేశాక" అని అమ్మ అంది.

భోజనాలు ముగిసేటంతవరకు అబ్బాయి వోపికపట్టి వున్నాడు.

"ఇక దాన్ని చెప్పెయ్యి" అని అమ్మ అడిగింది.

"ఏంలేదు స్నానాలగది కొళాయిని తెరచివచ్చాను. అంతే" అంటూ అబ్బాయి తనపని చూసుకోడానికి గబగబ అక్కడి నుంచి వెళ్లి పోయాడు.

డాక్టర్ వి. యన్. శర్మ.

(1322 పేజీ తరువాయి)

పొడచూపినది. మహిళా సంఘములు ఏర్పాటు అయినవి. మన నాయకులు, ప్రభుత్వమువారు ఆదరణ భావము చూపుచున్నారు. మహాత్ముడు సగంజనాభా అయిన స్త్రీల తోడ్పాటులేనిదే యే యుద్యమమైనను జయప్రదమగుట తేలిక యైనదికాదని నొక్కి చెప్పిరి. ఆఖరుసారిగా సవినయముగా చెప్పవలసినదేమనగా స్త్రీలయొక్క అత్యవసర అభివృద్ధిని గ్రహించవలసినదిగా స్త్రీ స్వాతంత్ర్యాభివృద్ధి నిరోధక శక్తులకు మనవి చేయుచున్నాను

—(౦)—





# వ్యాధి - చికిత్స

శ్రీ జి. వి. ఆర్. మూర్తి



(అక్టోబరు సంచిక తరువాయి)

దేహమునం దెట్టి బాధలు లేకుండా ఉన్నంత మాత్రమున సంపూర్ణారోగ్యమును కలిగియున్నట్లు భావించుటకు వీలులేదు. దేహమునందు చైతన్యశక్తి పనిపాటలయందు ఆసక్తి; మనసునందు సంతోషము ఉండవలెను. వేగముగా అలసి పోవుట, మనస్సు చిరచిరగా నుండుట, మొదలగునవి అనారోగ్య చిహ్నములు.

మానవ శరీరతత్వములు బహువిధములు. ఒకరి తత్వమునకు సరిపడునవి యింకొకరికి సరిపడవు. వ్యక్తికి వ్యక్తికి ప్రతివిషయమునందును కొలదిగనో, గొప్పగనో వ్యత్యాసముండుట సహజము. కనుక తత్వము ననుసరించి వ్యాధిని గుర్తించవలసి ఉండును; చికిత్స కూడ వేరుగనుండును. కాని సాధారణముగా మానవులలో నుండు ఆరోగ్య చిహ్నములకు వ్యతిరేకముగా నుండు వాటినిబట్టి శరీరము వ్యాధిగ్రస్తమయినదని వైద్యుడు నిర్ణయించును. కనుక ఆరోగ్యవంతునియందుండు లక్షణములను మనము తెలుసుకొనవలెను.

**నిద్ర :**

కొందరు ఎక్కువకాలము నిద్రపోవలసి ఉండును. కొందరు స్వల్పకాలమే నిద్రపోవుదురు. వారి వారి మామూలు ప్రకారము నిద్రపోక పోయినయెడల వారు ఉత్సాహరహితులుగా నుందురు. సాధారణముగా మానవునకు ఎనిమిది గంటల నిద్ర అవసరము.

**ఆహారము :**

చాలా మందికి మూడు పూటలు అన్నం తినడము అలవాటు. కొందరు అన్నమునకు బదులు వేరే ఆహారము తీసుకొనుటకూడాకలదు. ఆహారమును ఎన్ని పూటలు తిన్నను, ఏ రూపములో తీసుకున్నను, శరీరమునకు శక్తిని వేడినియిచ్చు సమ ఆహారమును, (Normal diet or well balanced diet) తీసుకో వలసి ఉన్నది. ఇది వారి దేశకాలమాన పరిస్థితుల బట్టియు, వారి వృత్తిబట్టియు మారును.

**నీరు :**

ఆహారముతోపాటు శరీరమునకు నీరుకూడా చాలా అవసరము. రోజుకు కనీసము 32 ఔన్సులు, లేక సేరు నీరును త్రాగవలసి ఉన్నది. మూడు సేర్ల వరకు నీరును త్రాగడము మంచిదే, కాని కాఫీ, టీ మొదలగు రూపములలో కాక మంచి నీరుగా త్రాగ వలసి ఉన్నది. కాఫీ, టీలకు బదులు శ్రేష్ఠమైన పాలు చాలా మేలు.

**వ్యాయామము :**

విశ్రాంతి, ఆహారము నీరు అవసరమైనట్లే శరీరము నకు కొంత వ్యాయామముకూడ అవసరము. దీనివలన శరీరకండరములకు బిగువు కలుగును. రక్తములోని ఎర్రకణములు ప్రాణవాయువును ఎక్కువగా సేకరించ గలవు. శరీరములోని మలిన పదార్థములు సులువుగా విసర్జించబడగలవు. కాని వ్యాయామమును శరీరము అలసిపోవునంతగా తీసుకొనిన కోలుకొనుటకు ఎక్కువ కాలము పట్టును. అందువలన శరీరము నీరసపడు టయు ఆరోగ్యము చెడుటయు సంభవించవచ్చును.

**మలమూత్రాదులు :**

ఆరోగ్యవంతమైన శరీరం దాని పనులను అది నిర్వర్తించుకుపోవును. మలమూత్రాదులు వాటం తట అవే జారీ అగును. దినమ్మున కొకసారి కాల విరోచనము, అయిదారుసార్లు మూత్రమువిడువ వలసి

లేక యాభై ఔన్సుల మూత్ర విసర్జనము జరగవలసి ఉన్నది. చెమట మూలకముగాకూడ శరీరము లోన శుభ్రపడుచుండును.

## స్నానము :

శరీరముపైనుండు చర్మమును శుభ్రపరచుటకు ప్రతి దినము స్నానముచేయవలసి ఉన్నది. అవసరమును బట్టి రోజుకు రెండు సార్లు చేయవచ్చును. కాని చాదస్తముకొలదీ దినమునకు పెక్కుసార్లు స్నానము చేసి, తడిబట్టలు కట్టుకుని నానుట మంచిది కాదు.

## రోగనిర్ణయము : (డయాగ్నసిస్) :

మానవ యంత్రము సక్రమముగా పోవుచున్నంత కాలము వైద్యమవసరములేదు. వక్రగతిని పోయిన వైద్యము చేయవలసిన అవసరము కలుగవచ్చును. వక్రగతిని ఎందుకు పోవలసివచ్చినదో తెలుసుకొనుటయే రోగ నిర్ణయము. దీనినే ఇంగ్లీషులో డయాగ్నసిస్ అందురు.

చికిత్సను ప్రారంభించుటకు ముందు రోగియొక్క జీవిత చరిత్రనుగూర్చి అనగా రోగియొక్క వృత్తి, నివసించు ప్రదేశము, యిదివరకు కలిగిన రోగములు, వాటికి తీసికొన్న చికిత్స, తలిదండ్రుల ఆరోగ్యము మొదలగు ననేక విషయములను వైద్యుడు తెలుసుకొనవలసి ఉన్నది. దీనివలన చికిత్సచేయుటకు మార్గమేర్పడును. భవిష్యత్తునందు రోగి తీసుకొనవలసిన జాగ్రత్తలనుగూర్చి వైద్యుడు హెచ్చరించగలడు; ఔషధ నిర్ణయము సులువగును.

రోగగ్రస్తుని శరీరముతోపాటు మనస్సుకూడ మార్పుచెందును. రోగ చిహ్నములయందు రోగియొక్క మానసిక మార్పులను, ప్రవృత్తులను హోమియో వైద్యుడు ముఖ్యముగా గమనించుచుండును.

రోగి అనుభవించు బాధలను రోగి మూలకముగను, రోగికి శుశ్రూషచేయువారి మూలకముగను వైద్యుడు మొదట తెలుసుకొని తరువాత రోగిని పరీక్షచేయును. నాలుక, గొంతుక, కన్నులు ఎటులున్నవి; చర్మముపైన నముకులు, కురుపులు, వాపులు ఏమైన ఉన్నవా అని కంటికి కనబడునంతవరకు చూచును.

ప్లీహము, కాలేయము పెద్దవైనవేమోనని చేతి వ్రేళ్లతో తడిమిచూచును. గుండె, ఊపిరి తిత్తులు, కడుపులోనుండివచ్చు శబ్దములద్వారా అవి సక్రమముగా పనిచేయుచున్నది లేనిది తెలుసుకొనును. వాటిపై వ్రేళ్ళతోకొట్టి నీరు చేరియున్నదేమోనని పరీక్షచేయును. ఇంకను వ్యాధినిబట్టి యంత్ర సహాయముగూడ అవసరమగుచుండును. రోగిని పరీక్ష చేయునపుడు ముఖ్యముగా గమనింపతగినది నాడి.

## నాడి :

గుండెలో ఎడమవైపు గుండెకాయ ఉన్నది. అది ఎల్లప్పుడు రక్తమును శుద్ధరక్త నాళములలోనికి పంపుకొట్టునట్లు పంపుచుండును. అది పంపుకొట్టునప్పుడు ప్రతిసారియు, శుద్ధరక్తనాళముపై చేయివైచిన, తెలియగలదు. చేతికి అందుబాటులో ముంజేతివద్ద శుద్ధరక్తనాళము చర్మమునకు దిగువనే ఉండుటచేత నాడిని అక్కడ పరీక్షచేయుటవాడుక. నాడిని పరీక్షచేయుటకు ముందు చేతికి గట్టికట్లు ఏవియులేకుండ చూడవలెను.

నాడియందు గమనింపవలసిన విషయములు రెండు: 1. వడి-నిమిషమునకు ఎన్నిసార్లు కొట్టుకొనుచున్నదో తెలుసుకొనవలెను. 2. స్వభావము వ్రేళ్లకు మామూలు కంటెను ఉద్రుతముగా తగులుచున్నదా, లేదా; మధ్య మధ్యను కొన్ని దెబ్బలు లోపించుచున్నవా; లెక్కపెట్టుటకు వీలులేనంత వడిగాపోవుచు, దెబ్బలో దెబ్బ లీనమగుచున్నదా మొదలగు విషయములను పరిశీలించవలెను.

నాడియొక్క వేగము వయస్సునుబట్టి మారుచుండును. ఆరోగ్యవంతులకు నాడి నిండుగా క్రమ పద్ధతిలో యీ దిగువ విధముగా నుండును.

1. పురిటి పిల్లలకు నిమిషమునకు — 140 సార్లు
2. చంటి పిల్లలకు ,, 120-130 ,,

| | | | |
|---|---|---|---|
| 3. బాల్యమునందు | 1 ని. | 100 – | సార్లు |
| 4. యవ్వనమునందు | 1 ని. | 90 – | ,, |
| 5. కౌమారము నందు | | 75 – | ,, |
| 6. వృద్ధాప్యమునందు | | 65-70 | ,, |

సర్వ సాధారణముగా పదిసంవత్సరములు దాటిన పిదప స్త్రీల నాడి పురుషుల నాడి కంటెను నిమిషమునకు 10 సార్లు ఎక్కువ కొట్టుకొనును. ఉదయమునందు, భోజనమునకు పిదప, అలసట, ఆతురత చెందిన తరువాత నాడి వడి యెక్కువగును. విశ్రాంతి యందును, ఉపవాసము చేయునపుడు వడి తగ్గును.

**శ్వాస :**

నాడితోగూడ గమనించవలసినది శ్వాస. ఆరోగ్యవంతులు ఉచ్ఛ్వాస నిశ్వాసలను సులువుగా చేయగలరు. ఉచ్ఛ్వాసయందు గుండె సమముగా పెద్దదగును; నిశ్వాసయందు సమముగా చిన్నదగును. ఆరోగ్యవంతులు నిమిషమునకు యిరువదిసార్లు గాలిని పీల్చి వదలుదురు. కొన్ని వ్యాధులవలనను, అలసట చెందుటవలనను, శ్వాసకోశ్టమునందు లేక ఊపిరి తిత్తులయందు అవరోధము కలుగుటవలనను శ్వాస 20 సార్లకన్న ఎక్కువగాని తక్కువగాని తీయుట జరుగును. శ్వాస సులువుగాగాక కష్టముతో తీయవలసి వచ్చును.

**ఉష్ణము :**

అన్ని కాలములందు, అన్ని వేళలయందును మానవ శరీరమునందు 98.4 డిగ్రీల (ఫారన్ హీట్) ఉష్ణము మాత్ర ముండును. కొద్దిమందికి 98.5°, 98.6° వరకు ఉండుటకూడగలదు. ఒక డిగ్రీ ఎక్కువగాని తక్కువగాని తరచుగా ఉండిన యెడల శరీరమునందు వ్యాధి అంకురించి ఉన్నదని చెప్పవచ్చును. శరీరములోని ఉష్ణమును తెలిసికొనుటకు క్లినికల్ థర్మామీటర్ను సాధారణముగా నాలుక క్రిందను పెట్టి చూచెదరు. ఒక్కొక్కప్పుడు చంకలోను, ఆసనములోను పెట్టి చూడవలసివచ్చును. చంకలో అర డిగ్రీ తక్కువగను, ఆసనమునందు ఒక డిగ్రీ యెక్కువగను థర్మామీటరు చూపును.

**నాలుక :**

నాలుకనుచూచి రోగ చిహ్నములను గుర్తించవచ్చును. జ్వరములయందు నాలిక తేమలేక పొడిగా పాచిపట్టి ఉండును, లేక ఎర్రగా నుండును. టైఫాయిడ్ జ్వరమునందు నాలిక బీటలుపడును. జీర్ణాశయ మండలమునందు కలుగు వ్యాధులందు నాలిక తెల్లగా పాచిపట్టి ఉండును. కాలేయ దోషముల యందు పసుపు వర్ణముగాను, చైతన్యశక్తి సన్నగిల్లినప్పుడు మట్టిరంగులోను, మృత్యువు సమీపించువారి నాలిక నల్లగను ఉండును.

**చర్మము :**

చర్మము మృదువుగా నుండుటకుగాను అది కొలదిగ తేమగనుండును, సమశీతలముగా నుండును. పొడిగ, వేడిగ నుండిన జ్వరమున్నదని గ్రహించవచ్చును. జ్వరమునందు చెమటపట్టిన జ్వరము తగ్గుచున్నదని తెలిసికొనవచ్చును; జ్వరము తగ్గకపోయిన జ్వరమే కాక యితర వ్యాధులుకూడ శరీరమునందున్నవని గ్రహించవలెను. శరీరము నీలివర్ణముగా మారుచుండిన గుండెకాయను సంబంధించిన వ్యాధియు, పసుపు వర్ణముగా మారిన కాలేయమునకు సంబంధించిన వ్యాధియు ఉన్నదని గ్రహించవలెను.

హోమియో వైద్యమునందు వివిధ విషయములను పరిశీలించవలసియున్నది. వ్యాధి పేరుతో నిమిత్తము లేదు. వ్యాధివలన శరీరమునందు కనబడు చిహ్నములే ఔషధ నిర్ణయమునకు ముఖ్యము.

[వచ్చే సంచికలో వ్యాధి – ఔషధ నిర్ణయము]



# ★ ★ ★ ★ నిర్మల ★ ★ ★ ★

శ్రీ సన్నాకుల సుందరరావు

---

సుబ్బులు లేస్తూనే "కృష్ణానదీమాతకి" వందనం ఆచరించింది. కళ్లు నులుపుకొని సుబ్బులు నిర్మల పడుకున్న మంచంవైపు చూసింది. సుబ్బులుకంతా. అయోమయంగాతోచింది. ఆ మంచం మీద నిర్మలలేదు. అప్పుడే అక్కయ్య చెప్పిన మాటలు ఆమె చెవుల్లో మారుమ్రోగాయి. సుబ్బులుకి వళ్ళంతా జలదరించింది.

ఆతృతతో "బావా!" అంటూ గట్టిగా పిలచింది సుబ్బులు. సూర్యం, ఆ పిలుపు విని గాభరాగా లేచాడు. "ఏమయిందేమిటి సుబ్బులూ!" అని ఆశ్చర్యంగా అడిగాడు సూర్యం.

"అక్కయ్య కనపడటంలేదు" అని ఆతృతతో అంది సుబ్బులు.

"క్రిందికి వెళ్లిందేమో ?"

"అదికాదు బావా! రాత్రి తానిక జీవించటం వ్యర్థమనీ, ప్రాణహత్య ఉపాయమే తన గతనీ, అక్కయ్య నాతో చెప్పింది."

"ఆ! అలాగా! అయితే క్రిందికి పద"

సుబ్బులు మెల్లగా లేచి, తడబడే గుండెల్తో సూర్యాన్ని అనుసరించింది. ఆ నడకలో ఆతృత, ఆవేదన ఉట్టిపడుతున్నయ్. కృష్ణానదికీ - శివాలయం వీథికీ ఎంతోదూరంలేదు. మేడమీద నిల్చుంటే, నదీమాత ప్రత్యక్షంగా కన్పిస్తుంది. అప్పుడప్పుడే తెల్లవారుతుంది. సూర్యం రెగ్యులేటర్ మీదకు వచ్చాడు. ఆ అంధకారంలో అక్కడక్కడ దీపాలు మిణుకు మిణుకు మంటున్నయ్.

అప్పుడే మ్యునిసిపల్ సైరన్ నాలుగు గంటలు కూసింది. పడవలు నిలుచుండే రేవు సమీపానికి సూర్యం, సుబ్బులూ వెళ్ళారు.

ఆ రోడ్డు మీద జనసంచారంలేదు. అక్కడక్కడ రిక్షాలు మాత్రం కన్పిస్తున్నయ్. ఆ ప్రశాంత పరిణామంలో నది చేసే హోరుమనే శబ్దం స్పష్టంగా విన్పిస్తుంది.

ఆ చీకట్లో ఓ ఆకారం! సూర్యాన్ని సమీపించింది. "బాబూ! ఈ అడ్రస్సు కాస్త చదివియ్యండి" ఆ వచ్చిన మనిషి సూర్యానికి అడ్డంగా నిలచి అర్థించాడు.

సూర్యం లాంతరు వెలుగులో ఆకవరు వైపు చూశాడు. అతని కాశ్చర్యంవేసింది. అది తన అడ్రసే! "త్వరగా ఇది ఎవరిచ్చారు" అని అడిగాడు సూర్యం.

"ఒక అమ్మగారిచ్చి అటుగా రోడ్డంట వెళ్ళారు. ఓ ఐదు రూపాయలిచ్చి, ఈ అడ్రసు ప్రకారం ఉత్తరాన్ని అందచెయ్య మన్నారు" అని చెప్పాడతడు.

"మీ అక్కయ్య కొంప ముంచింది సుబ్బులూ" అని విచారంతో అన్నాడు సూర్యం.

సూర్యం గబగబా అంగలు వేసుకుంటూ స్నానాల రేవు వద్దకు వెళ్ళాడు. ఆ అంధకారంలో నది నిశ్చలంగా ప్రవహిస్తుంది. ఆ నీటిపై మాత్రం బట్టలు కన్పించాయతనికి.

సూర్యం నిట్టూర్పు విడిచాడు. సుబ్బులు కూడా అతన్ని సమీపించింది. "సుబ్బులూ! మీ అక్కయ్య ఆత్మహత్య చేసుకుంది" అని విచారవదనంతో అన్నాడు సూర్యం. సుబ్బులు బావురుమంది. సుబ్బుల్ని ఓదార్చి రోడ్డుమీద ఉన్న లాంతరు క్రిందికి వచ్చాడు సూర్యం.

వణుకుతున్న చేతులతో కవరు విప్పాడు సూర్యం. ఆ త్రవాత నిర్మలది. నిశ్శబ్దంగా తదేకదీక్షతో సూర్యం ఆ ఉత్తరాన్ని చదువసాగాడు.

'బావా! నేనీప్రపంచాన్నీ, ఆప్తుల్నీ వదలి, నాకు తెలియని, మరొకలోకంలోకి వెళ్లటానికి ఇష్టంలేకపోయినా, ఈ సమాజంలో, సంఘంలో, బ్రతుకలేక, బలవంతంమీద వెడుతున్నా! ఈ ఆత్మహత్య చేసికొని, మీకు, చెల్లికీ, తల్లితండ్రులకీ, దుఃఖాన్ని, పెట్టిపోతున్నాను.

దీనికి కారణం ఎవరూ కాదు. నేను స్త్రీనైయుండి, తోటిస్త్రీలూ, బంధువులూ పొందే, ఆనందాన్ని చూస్తూ! అలాటి ఆనందాలకూ, వినోదలకూ, దూరంగా ఉంటూ, ఒకపనికిరాని వస్తువులా జీవించలేను.

నిన్నువివాహం చేసికోవాలని, ఉవ్విళ్లూరాను. కాని, వరకట్నపిశాచి, నన్ను నీనుంచి దూరంచేసింది. అత్తయ్య, అడిగిన వేలవేలకట్నం నాన్న ఇవ్వలేక నన్నో ముసలాడికిచ్చి చేశారు. దాదాపు ఈ లోకంలో ఉన్న తలిదండ్రులంతా తమ కుమార్తెలను ఎలాగైనా వదిలించుకోటానికి చూస్తుంటారు.

అంత మాత్రనికే నా తలితండ్రులు నా మీద ప్రేమాభిమానాలు చూపలేదని నేననను. స్వతహాగా తల్లిదండ్రులందరికీ పిల్లలంటే అపారమైన ప్రేమఉంటుంది. ఒక సామాన్య గుమస్తా! తనకుమార్తెకు కట్నం ఇవ్వలేక మంచి సంబంధం ఎలా చెయ్యగలడు!

నా భర్త శంకరరావుకి ఆప్తులెవ్వరూ లేరు. అన్నిటినీమించి శక్తివంతమైన ధనం మాత్రం ఉంది. నాకు ఆయనేమీ లోటురానీయలేదు. ఉన్న చీరలు నగలూ

అలంకరించుకుని నా భర్తను సంతోష పెట్టటమే నావిధయింది.

కాని సంసారంలో దాంపత్యంలో ఎలాటి సుఖమూ లేదు. అడిగినవన్నీ లభించేయి! దాసదాసీలు నేను మంచంమీద ఉండగానే నాకన్నీ ఏర్పాటుచేసేవారు. కాని ప్రతీస్త్రీ వాంఛించేది శరీర – ఆత్మ సంతోషాలే! అవి! ఏవిధంగా లభిస్తయ్! యువకుడైన భర్తా, మంచి ఉద్యోగం, ప్రేమ ఉన్నపుడే ప్రాప్తమవుతయ్.

నేను మానసికంగా ఎంతో బాధ చెందాను. నేనుచెందే బాధకు ఒక్కొక్కపుడు తల్లితండ్రుల్నీ కాక విధినికూడా నిందించాను కాని విధి! ఏం చెయ్యగలదు! ఈ కట్నాలనేవి మానవులు ఏర్పరచుకున్న వేగా!

నేను కాపురంచేసిన రెండేళ్లూ కష్ట పరంపరలతో గడచిపోయాయి. అంతలోనే నా భర్త క్షయతో మరణించారు. ఆ స్తియావత్తూ నాపేర వ్రాసి, దాన్ని నా యిష్టం వచ్చినట్లు వినియోగించవచ్చునన్నారు. నేను వితంతువు నవటంతో ఐదులక్షలఆస్తి నకు లభించింది.

దాని ద్వారా నా పుట్టిల్లు సుఖించింది. తలి, తండ్రులు ఆనందించారు. నేను విధవనవటం, వారికి ధనప్రాప్తి కలుగటం లభించింది. కష్టాలు గట్టెక్కినందుకు అమ్మా నాన్నా ఎంతో సంతోషించారు.

నా భర్త పోవటంతో సంఘంలో కష్టాల్నెదురుకోవాల్సొచ్చింది. పేరంటానికి వచ్చే స్త్రీలు, నాకు బొట్టు పెట్టకపోవటం, శుభకార్యాలకు పిలవకపోవటం, నన్ను కష్టపెట్టించాయి. నేనూ, ఒక స్త్రీనే అందరూ ఆశించేకోరికలే ఉంటాయి. సినిమాలు చూడాలనీ, నాటకాలకు వెళ్ళాలనీ అనుకునేదాన్ని; నా చిత్తం వచ్చినట్లు చేయటానికి నాకు స్వాతంత్ర్యం లేకపోయింది.

నేను విచారంతో నా యవ్వనాన్నీ, కోర్కెల్నీ అణచుకొని జీవించాల్సొచ్చింది. ఈ విషయంలో నేనొక ద్రోహం చేశాను. దాన్ని నీవు మరచినా నేను మరువలేను.

ఆ శనివారంరోజు అంతా గుడికి వెళ్ళారు. నేనొక్కదాన్నే ఇంట్లో ఉన్నా. నేను ఉద్రేకంతో నిన్ను కౌగలించుకున్నాను. అందుకు ఫలితం – చెంపదెబ్బ! నేనీ విషయంలో నిన్ను కష్టపెట్టటమే కాకుండా అవమానింపబడ్డాను.

అందుకే ఈ లోకం విడిచివెళుతున్నా! నాకిక ఎలాటి కోర్కెలూ ఉండవు. కాని నేనొక్కటి కోరతాను. నాలా భారత దేశంలో వితంతువులై, సంఘం మధ్యా, లోకంమధ్యా బాధపడే అనాధులకూ, వర

కట్న నిర్మూలనాశయులకూ నా ఆస్తి లోంచి, సహాయం చెయ్యాలి. మిగిలిన ఆస్తి నా చెల్లికి చెందుతుంది.

ఆఖరి క్షణంలో ఇంకొక కోర్కె మాత్రముంది. ఈ లేఖ చూచిన వెంటనే సుబ్బులక్ష్మిని నీవు వివాహం చేసుకోవాలి. ఆనాడే నా ఆత్మకు శాంతి.

తప్పులేమైనా ఉంటే క్షమించు బావా?

నీ "నిర్మల"

సూర్యానికా ఉత్తరం చదివేసరికి కళ్లనుంచి బాష్ప బిందువులు రాలాయి. సుబ్బులు తన చెంగుతో కన్నీరు తుడుస్తూ బావ ముఖంలోకి చూసింది.

"పద సుబ్బులూ! ఇప్పుడే మీ అక్కయ్య కోర్కె పాటించి, దుర్గ గుడిలో నిన్ను నా దానిగా చేసుకుంటా" అన్నాడు సూర్యం.

సుబ్బులు మెల్లగా కదిలింది. నూతన వధూవరులలా బయలుదేరే సమయంలో నిర్మల ఆత్మకు శాంతి చేకూర్చటానికి కాబోలు దుర్గగుడిలోని గంటలు ఒక్కసారిగా మ్రోగాయి. ఆ అంధకారంలో సుబ్బులూ, సూర్యం గుడివైపుకు వెళ్ళారు.

---



న్యూఢిల్లీలో ఏర్పాటు చేయబడిన భారత పారిశ్రామిక ప్రదర్శనముసందు బొంబాయి సంక్షేమ బోర్డువారు శ్రామిక కుటుంబమహిళలు తీరిక సమయాలలో తయారుచేసిన వానిని సమీకరించిన వస్తు సామగ్రి

(1298 పేజీ తరువాయి)

కూడ కొత్త మార్గాన్ని తొక్కదలుచుకొన్నాడు. జంగం కథలలో అంతకు పూర్వపు పద్ధతేమంటే - కథానాయకునియొక్క పుట్టుక దగ్గరనుంచి చావు వరకు వర్ణించడం. ఈ మార్గానికి శ్రీనాథుడు ఒక విధంగా స్వస్తి చెప్పేడు. అసలు పల్నాటి వీరుల కథ అనుగు రాజుతో ప్రారంభించి, దొడ్డనాయుణ్ణి గురించిచెప్పి, నాగమ్మ జననం మొదలైనవాటితో ఉండవలసింది. కాని ఈ కవి ఆ విధానాన్ని మానివేసేడు. యుద్ధభూమికి రెండు పక్షాల సైన్యాలను తీసుకువచ్చి కథను ప్రారంభించేడు ఈ మోస్తరుగా కథ హఠాత్తుగా వీరరసంతో మొదలు పెట్టింది. శ్రీనాథుని పద్ధతియొక్క చక్కదనాన్ని గంగుల పినయెల్లన్న (క్రీ. శ. 1700) గమనించి, కామరాజు కథలో అవలంబించదలచుకొని—

వలనొప్ప శ్రీనాథువచన పద్ధతిని
సలిపెను (?) యదుశాస్త్రమంతయును

అన్నాడు.

శ్రీనాథుడు ఏర్పరచిన నూతన విధానాన్ని గంగుల పినయెల్లన్న తప్ప మరెవరూ అనుసరించలేదు. పాతపుంతలను విడిచిపెట్టడం కష్టమైనపని కదా!

## కథా ప్రశంస

పల్నాటి వీరకథా ప్రశంస ఇతర గ్రంథాలలో కనబడుతూంది.

సీ. భారత కథలోని బాలరాజొక్కడు
కుంభకర్ణుని బట్టి గుద్ది చంపె ÷

విచారణాలలో చెప్పబడ్డ బాలరాజు బాలచంద్రుడు అని ఒక విమర్శకుని ⊳ ఊహ. కాని ఇది సరియైనదిగా తోచదు. ఎందుచేతంటే బాలరాజు లేని జంగంకథ సుమారుగా లేదనే చెప్పవచ్చు. అటువంటి సందర్భంలో ఈ బాలరాజు బాలచంద్రుడన్న మాటేమిటి!

(సశేషము)

÷ ఈ పద్యం ముద్గరశతకంలోదని సి. పి. బ్రౌను గారు ఒక వ్రాత ప్రతిలో సూచించేరు.

⊳ ఆంధ్ర పత్రిక - విజయ సంవత్సరాది సంచిక, పుట 33.

## విజ్ఞప్తి

ఈ సంస్థ స్థాపింపబడి ఐదేళ్లయైనను, రాయలసీమ కరువులలోను, గోదావరి వరదలలోను పీడిత ప్రజానీకమునకు ఒనర్చిన సేవనింకను ఆంధ్రులు విస్మరింపరనియే మా విశ్వాసము. ఈ సేవా కార్యమునకు కనక వర్షము కురియించిన ఉదార పురుషులనుగూడ మేము మరువజాలము. వారికి మా నివేదన ఏమన;

ప్రస్తుతము మేము పూనుకొనిన అలోపతి ఉచిత వైద్యశాలకు రు. 12 వేలును 'స్టూడెంట్సుహోమ్' భవన పరిపూర్తికి రు. 18 వేలును, రు. 20 వేలు సద్గ్రంథ ప్రచురణాదికమునకును కావలసియున్నవి. గ్రంథాలయమునుకూడ అభివృద్ధిపరచవలెను.

ఈ కార్యములన్నియు ఆంధ్రమహాజనుల ఔదార్యముమీదనే నిర్భరపడియున్నవి.

ఎవరు ఏ కార్యము నిమిత్తము ఏకొలది పంపినను ధన్యవాద పూర్వకముగా స్వీకరింపబడును. ఈ దిగువ కనపరచిన ఎడ్రసుకు పంపవచ్చును.

ఇటు
స్వామీ నిర్వికల్పానంద
అధ్యక్షులు, రామకృష్ణమఠము,
రాజమండ్రి

# తేలుకాటుకు మంత్రము

దేవదానవ యుద్ధే మథ్యమానే మహోదధౌ
జాతోఽసి వృశ్చి రాజ స్త్వం స్వగృహం గచ్ఛ మహా విషః ॥

తా॥ దేవదానవుల సంగ్రామందు మహోదధి మథించబడెను. ఓ వృశ్చికరాజా! నీవందుండి యుద్భవించితివి. నీ కుట్టుయొక్క మహా విషము స్వకీయవాసమునకు జనుగాక!

తేలు, పాముకాటు మంత్రములు తెలిసినవారు వానిని యితరులకు బోధించుటవలన నిష్ప్రయోజనమగుననుకొనుట పొరబాటు. మంత్రమును యితరులకు బోధించుటవలన మరింత ప్రజోపయుక్తమయి, మహత్తరమైన శక్తివంతముకాగలదు.

అయితే అపాయములోనున్న వారికి సహాయపడ నిరాకరించినను, నిర్బంధముగా పారితోషికము కోరినను, లేదా స్వార్థమునకే ప్రాధాన్యత యిచ్చినను, మంత్రశక్తి క్షీణించును. పరోపకారాపేక్షతో అనుష్టానపరులై మంత్రమును జపించినచో మంత్రము మహోపయుక్తము కాగలదు.

సూర్య గ్రహణ సమయమున మంత్రమును జపించుచో ఫలవంతముకాగలదు. అనుదినం 108 సార్లు తేలు మంత్రమును జపించు అనుష్టానపరులు మంత్రసిద్ధిని పొందుదురు.

తేలుకుట్టి బాధగానున్న భాగమునకు పైభాగమున నొక గుడ్డ పేలికనుకట్టి మనసులో పదిసార్లు మంత్రమును జపించి అఘాటుగా కట్టిన గుడ్డపేలికనువిప్పి దాని విషముదిగిన సూచనగా గాలిలో రెండు మూడుసార్లు గుడ్డ పేలికను విదిలించవలెను.

'శివానంద పాదసేవక్'

స్వామి శ్రీనివాసానంద సరస్వతి

---



నెలరోజులు భారతదేశ పర్యటనకు వచ్చిన నేపాలు రాజదంపతులు.




సీరియల్ కథ

# విజయలక్ష్మి

శ్రీ పిళ్ళా సుబ్బారావుశాస్త్రి

(గతసంచిక తరువాయి)

అంతలోనే సుడిగాలిలో ప్రవేశించింది రాక్షసి. విజయలక్ష్మి "భయపడక, మన వుపాయం ప్రకారం నడవండి...!" అని హెచ్చరించింది.

రాక్షసిని చూసి అంతా గొల్లున ఏడ్చారు. రాక్షసి "ఎందుకేడుస్తున్నారు ... ?" అని అడిగింది.

"అమ్మా ...! ఇవ్వాళ నువ్వు వెళ్లగానే ఒక రాక్షసివచ్చి మమ్మల్ని భయపెట్టిందే, చంపేస్తానని...!" అంటూ రాక్షసిని చుట్టుముట్టి మళ్లాగొల్లుమన్నారంతా.

"పిచ్చిపిల్లల్లారా ...! వాణ్నిచూశా మీరు భయపడ్డారు ...? నేనుంటూండగా వాడు మిమ్మల్నేమీ చెయ్యలేడు!" అంది నొకరనుకొని రాక్షసి.

"అమ్మా ..! నిన్నుకూడా చంపుతానన్నాడే!" అంది విజయ కన్నీళ్లు తెచ్చుకుంటూ.

"అమ్మా" అనగానే రాక్షసి ఉబ్బిపోయింది. "పిచ్చి పిల్లా ...! నన్నెవరూ చంపలేరు...!" అంది రాక్షసి గర్వంగా.

విజయ ప్రక్కనున్న రత్నని మోచేతితో పొడవగానే రత్న "అమ్మా...! నీకంతబలం వుందా?" అని అడిగింది.

"హిః హిఃహ్హిః...! బలం వుందిగాని, లేకపోయినా ఏంచెయ్యలేడు!"

"ఏమీ ...?" అంది చంద్ర.

"నాప్రాణాలు యిక్కడలేవు మీకు మల్లేనే ..." అంది రాక్షసి.

"ఎక్కడున్నాయమ్మా ...?" అంది వింధ్య.

"చెప్పవే ...! నువ్వు చెబితే మాకు ధైర్యంగా వుంటుంది ..!" అంది విజయ.

రాక్షసి చెయ్యి పట్టుకు మంచమీద కూర్చో బెట్టి.

రాక్షసి యిక కాదనలేకపోయింది. ఒక్కసారి వరసగా అందర్నీ దగ్గరకు తీసుకు ముద్దుపెట్టుకుంది.

"ఇదో, యీ రహస్యం యెవరికీ చెప్పకండి .. ! —ఇదో యీ దిక్కునే పది మైళ్లు ప్రయాణం చేస్తే, ఒక పెద్ద మఱ్ఱి చెట్టుకనిపిస్తుంది. ఆ మఱ్ఱి తొర్రలో గుండా ఎడంవైపుగా మూడు ఫర్లాంగులు పోతే ఒక సింహం విగ్రహం వుంటుంది! ఆ విగ్రహంనోట్లో పైవరుసలో వున్న మూడోపంటిని నొక్కినట్లయితే, ప్రక్కనే పెద్దస్వరంగం యేర్పడుతుంది...! దానిలోకి మెట్లు వుంటాయి ఆ మెట్లుదిగి వెళితే పాతాళంలోకి పోతారు. పాతాళంలోకి కొద్దిదూరం పోయినట్లయితే మూడు పెద్ద సింహద్వారాలు కనిపిస్తాయి. ఆ సింహ ద్వారాలలో మధ్య ద్వారందగ్గరికి పోయి "లలులు లెలులు లోలాలి .. లాలి! " అని అనాలి. అంటే "తలుపు తెరచుకో వాలి ... కాళి! "అని అర్థం !తలుపు తెరచుకోగానే లోపలికి పోతే మీకు భయంకరమయిన పెద్దభూతం కనిపిస్తుంది. అది మీమీద కురుకపోతుంది అప్పుడు యీ మంత్రం పఠించాలి.

భం! భం!! భం!!!
భి! భీ! భీం!!!
భ భీ ... భా భా !
భేభు ... ! భాభీ భ భుభ్భి ... !
భభు భు భో ... ! భాభి భిభ్భు ... !
శైశాళీ ... ! శై శై శాళీ ... !
తాకీ ... ! తాకీ ...!"

వెంటనే భూతంమీకు దారి యిస్తుంది. లోపలికి పోయినట్లయితే ఒక పెద్ద తాటిచెట్టుకనిపిస్తుంది. దానిమీద రెండుపావురాలు వుంటాయి. ఆపావురాలదగ్గర ఒక గుడ్డువుంటుంది. ఆ గుడ్డుకాని పగలగొడితే నాప్రాణం పోతుంది...! " అందిరాక్షసి.

"సరే! చీకటిపడింది ..! నే వెళ్తాను. మీరు భోజనం చెయ్యండి ...! "అంటూ రాక్షసి వెళ్లిపోయి శ్మశానానికి ..!

విజయలక్ష్మి ఆలోచిస్తూ కూర్చుంది.

"అక్కా ..! చస్తే చద్దాముగాని, అక్కడికి వెళ్లలేము !" అంది వింధ్య.

"వింధ్యా ...! ఎక్కడయినా మనకి చావు తప్పదు! మీరంతా యిక్కడే వుండండి! ఇప్పుడే నేవెళుతానుగాని మీరు జాగ్రతగా దానికి నేనుకూడా వున్నట్టే యుక్తిగా మెలగండి" అంటూ చెప్పి విజయ మగవాడిలా తయారయింది

విజయనంతా విచారిస్తూ సాగనంపేరు. విజయ అందరికీ ధైర్యంచెప్పి రాక్షసి ప్రాణలున్న స్థలానికి బయలుదేరింది.

విజయలక్ష్మి అతికష్టంమీద మధ్యాన్న సమయానికి తాటిచెట్టు చేరుకుంది. తాటిచెట్టు చాల పొడవుగావుంది.

"ఎలా ఎక్కడం" అని ఆలోచించింది. విజయలక్ష్మికొక వుపాయం తట్టింది. వెంటనే గురిచూసి చెట్టుచుట్టూ తిరుగుతున్న పావురాని రాయితో కొట్టింది. అది వెంటనే అంతపైనుండీ, క్రింద గడ్డిలో పడిపోయింది.

పావురం చచ్చిపోగానే, విజయలక్ష్మి ఒక చెట్టుఎక్కి కూర్చొని, పరకాయ మంత్రంద్వారా ఆ పావురంలో ప్రవేశించింది.

పావురం రివ్వున ఎగురుకుంటూ వెళ్లి తాటిచెట్టుమీదకి వెళ్లింది. చెట్టుమీద మగపావురం, ఆడపావురం చచ్చిపోయిందని దుఃఖిస్తోంది. విజయనిచూసి సంతోషంగా గ్రుడ్డుని కాపాడమనిచెప్పి ఆహారానికి వెళ్లిపోయింది.

అది ఆహారానికి వెళ్లగానే విజయలక్ష్మి పావురం రూపంలో వుందిగా ఆమె గ్రుడ్డుని ముక్కుతో పొడిచి క్రిందకు తోసేసింది.

అంతలోనే పెద్ద అరుపులు అరుచుకుంటూ రాక్షసివచ్చి నేలకూలింది. విజయలక్ష్మి తిరిగి తన శరీరంలోకి ప్రవేశించి భవనమునకు బయలు దేరింది.

ఆశ్చర్యం! రాకుమార్తెలంతా పెద్ద మైదానంమీద కూర్చొనివున్నారు. ఆ భవనంలో యేవీ లేవు!

విజయలక్ష్మినిచూసి అంతా ఒక్కసారి వచ్చి కౌగలించుకున్నారు. విజయలక్ష్మి అందరితో కోయరాజ్యానికి బయలు దేరింది.

కోయరాజ్యం వెళ్లిన తర్వాత రాజకుమార్తెలంతా "అక్కా! నా రాజ్యానికి రా..! అంటే నా రాజ్యానికి రా చెల్లీ" అని కోరేరు.

విజయలక్ష్మి "ఇప్పుడురాను! నా కవసరం వున్నప్పుడు మీ సైన్యం కోరుతాను! వాటితో రండి" అంటూ పంపేసింది. (సశేషము)




'తెలుగుదేశం' దీపావళి సంచిక మా కార్యాలయమునకు చేరినది. ఇందులో విశాలాంధ్ర నిర్మాణావశ్యకతను వివరించే అమూల్యమైన వ్యాసాలు, సాధారణ శీర్షికలు కలవు. హైదరాబాద్ నుండి వెలువడుతున్న యీ వారపత్రిక తెలుగు ప్రజానీకపు అభ్యుదయ, అభివృద్ధుల నుద్దేశించి చేయుచున్న కృషి అపారము. సంపాదకురాలు : శ్రీమతి సూర్యదేవర రాజ్యలక్ష్మి. వెల 0-3-0. ప్రాప్తి స్థానము తెలుగుదేశం కార్యాలయం, ఏ. 10-756 హిమయత్ నగర్, హైదరాబాద్ (దక్కన్)

♦ ♦ ♦

'ఆంధ్ర మహిళ' 12-వ వార్షిక సంచిక ఎప్పటియట్లు సర్వాంగ సుందరముగా వెలువడింది. వెల రు. 1-0-0.

ఇందులో ఆంధ్ర మహిళాసభ అభ్యుదయ అభివృద్ధులను వివరించే చిత్రాలు, వ్యాసాలతో బాటు అమూల్యమైన రచనలు కలవు. చక్కని కథానికలు, నాటికలు గేయాలతో ముచ్చటగా వెలువడజేసిన పత్రికా నిర్వాహకులు అభినందనీయులు. ఆంధ్ర మహిళ కలకాలము వర్ధిల్లి ఆంధ్ర నారీలోకానికి విద్యా, వినోద, విజ్ఞాన రంగాలలో తోడునీడై యుండాలని మా ఆశ. ప్రతులకు ఆంధ్ర మహిళాసభ లజ్ చర్చి రోడ్డ్, మద్రాసు 4.

♦ ♦ ♦

'ఢంకా' దీపావళి సంచిక మా కార్యాలయమునకు చేరినది. కథలు, గేయాలతోటి, ప్రత్యేక వ్యాసాలతోటి యీ సంచిక వెలువడింది. ఇందలి త్రివర్ణ చిత్రాలు ప్రత్యేకతను సమకూర్చినవి. వెల రు. 1 0-0. ప్రాప్తి స్థానము ఢంకా కార్యాలయము, 31 లింగిచెట్టివీధి, మద్రాసు 1.

♦ ♦ ♦

'ఆనందవాణి' ప్రత్యేక సంచిక మా కార్యాలయమునకు చేరినది. ఆకర్షణీయమైన అంజలీదేవి ముఖచిత్రంతో వెలువడింది. ఇందులో సుప్రసిద్ధ రచయితల కథానికలు, వ్యాసములు అనేకము కలవు. ఈ సంచిక పాఠకుల నెంతైనా ఉల్లాసపరచగలదు. సంపాదకురాలు శ్రీమతి వి. ప్రభావతి. కార్యస్థానం 14 తంబుచెట్టివీధి, మద్రాసు 1. వెల 0-12-0.

♦ ♦ ♦

'జగతి' మాస పత్రిక మా కార్యాలయమునకు చేరినది. సంపాదకులు శ్రీ యన్. ఆర్. చందూర్.

ఇది క్రొంగ్రొత్త రీతులలో పిన్నలను, పెద్దలను ఉల్లాసపర్చడానికి, విజ్ఞాన విశేషములను పూరించడానికి అనువైన రచనలతో నొప్పుచున్నది. ఇట్టి పత్రికలు ప్రజాభ్యుదయాని కెంతైనా అవసరము. ప్రజాబాహుళ్యం యీ పత్రికను తమ అభ్యుదయ పురోభివృద్ధులకు వినియోగించుకుంటారని మా విశ్వాసం. విడిప్రతి 0-6-0. సంవత్సర చందా రు. 4-0-0 కార్యస్థానం 49 మూకత్తాల్ స్ట్రీటు, వేపేరి, మద్రాసు 7.



# సంపాదకీయములు

## రాష్ట్రపతి జన్మదినోత్సవము

రాజకీయాలలో దూషణ భూషణలు సర్వసాధారణం. దాని కతీతులు బహు అరుదు. కాని ఇండియా ప్రెసిడెంటు డాక్టరు రాజేంద్రప్రసాద్ భారత జాతీయ కాంగ్రెస్ అధినేతగా సయితం యావత్ప్రజానీకపు ఆదరాభిమానములకు పాత్రుడైనవాడు. అజాత శత్రువు. భారతజాతీయ కాంగ్రెస్‌లో కలవరపాటు ఏర్పడినప్పుడల్లా సారథ్యాన్ని స్వీకరించడానికి తయారయి జాతీయ సంస్థలో పటిష్టతను, ఉత్సాహాన్ని, నిర్మాణ కార్యక్రమాన్ని ప్రోత్సహించకలిగిన ధీశాలి డాక్టర్ ప్రసాద్.

ఈ నాడు భారతావనికి అధినేత అవడానికి ఆయనలోని ఉత్తమోత్తమ గుణాలే కారణము. ఆయన విశాల హృదయం, ఉదారమైన భావాలు, ప్రజాహితముపట్ల ఆయనకుగల ఆసక్తి యావద్భారత ప్రజానీకాన్ని ముగ్ధులను చేస్తున్నవి. ఆయన నీ నాడు ప్రేమించి, ఆరాధించుచున్న మనం ఆయన ఆయురారోగ్యాలకొరకు భగవంతుని ప్రార్థిస్తూ, ఆయన నాయకత్వము కలకాలము భారతావనికి లభ్యంకావాలని ఆశిద్దాం!

## నాగార్జున సాగర్ ప్రారంభోత్సవము

భారత ప్రధాని పండితనెహ్రూ నాగార్జునసాగర్ శంకుస్థాపనోత్సవము అత్యంత వైభవోపేతంగా చేయడం చరిత్రాత్మకంగా సుప్రసిద్ధము.

ఈ సాగర్ నిర్మాణంతో నాగార్జునాచార్యుని కేంద్రం తిరిగి ప్రపంచయాత్రా స్థలము కానుండటం, యావదాంధ్ర దేశాన్ని సస్యశ్యామలంగా, సౌభాగ్యవిలసితంగా కానుండటం ఎంతైనా ఆనందించవలసిన విషయము.

అంతేకాక తెలుగుభాషా ప్రజానీకం ఉమ్మడిగా ఆర్థిక, సాంఘిక, రాజకీయరంగాలలో తమ అభ్యుదయ పురోభివృద్ధులను రూపొందించుకొనుటకు ఏర్పడనున్న వాతావరణము విశేషంగా అనుకూలమయినది.

ఈ సందర్భమున ఆంధ్ర, తెలంగాణా ప్రజానీకం భాష, సాంస్కృతిక ప్రాతిపదికలమీద ఒకే తెగకు చెందినవారను విషయము గుర్తించి పరస్పర సద్భావ, సహకార, సహాయాలతో తమ భావి పురోభివృద్ధి నుద్దేశించి ఏకరాష్ట్రవాసులుగా ఏర్పడాలి. ఉభయ ప్రాంతాల ఏకీకరణ ఫలితంగా ఏర్పడనున్న విశాలాంధ్ర రాష్ట్ర శ్రేయస్సుకేకాక యావద్భారత శాంతి సౌభాగ్యాలకు విశేషంగా ఉపయోగపడగలదు.

విశాలాంధ్ర నిర్మాణం ఆంధ్ర, తెలంగాణా ప్రజానీకంలో నమ్మకమును, ఉత్సాహమును పూరించగలవని ఆశిస్తూ, పరిసర రాష్ట్రాలలోని తెలుగుభాషా ప్రాంతాలు సయితం విశాలాంధ్రతో ఏకం కావడానికి అవకాశం ఏర్పడగలదని ఆశిద్దాం!

## శ్రీ మన్మథనామ సం॥ర మార్గశీర్ష - పౌష్యమాసములు

| | | | |
|---|---|---|---|
| 1955 సం॥ డిశంబరు నెల | 16 | శు | వి 31.37 పూషా 33.53 శూన్యతిథిః |
| | 17 | శ | త 26.15 ఉషా 39.36 |
| | 18 | ఆ | చ 30-22 శ్రవ 44.47 త్యా 4.18 |
| | 19 | సో | పం 33.45 ధ 49.14 త్యాజ్యాభావః |
| | 20 | మం | ష 36.9 శ 52.42 త్యా 4.15 |
| | 21 | బు | స 7-24 పూభా 55.1 సిద్ధియోగః |
| | 22 | గు | అ 37-25 ఉభా 56.8 |
| | 23 | శు | న 32.10 రే 56.0 అమృతసిద్ధియోగః |
| | 24 | శ | ద 33.40 అశ్వ 54.39 త్యా 3.55 |
| | 25 | ఆ | ఏ 30.2 భర 52.14 వైకుంఠైకాదశి, శ్రీరంగక్షేత్రద్వారదర్శన మహోత్సవం |
| | 26 | సో | ద్వా 25.24 కృ 48.51 త్యా 3 47 |
| | 27 | మం | త్ర 20.0 రో 44.50 తిథిద్వయం |
| | 28 | బు | చతు 14.1 మృ 40.21 దత్తాత్రేయ జయంతి |
| | 29 | గు | ○ పౌ 7-45 ఆర్ద్రా 35 43 చిదంబరక్షేత్ర ఆర్ద్రాదర్శనం |
| | 30 | శు | కృపా 1-27 ఏవ్యం 53-47 పున 31.14 పరశురామజయంతి |
| | 31 | శ | త 49.38 పుష్య 27.8 త్యా 3.47 ప్రదోషాభావః |
| 1956 సం॥ జనవరి నెల | 1 | ఆ | చ 44.49 ఆశ్లే 23.40 ఆంగ్లసంవత్సరారంభం |
| | 2 | సో | పం 40 58 మఖ 21.5 |
| | 3 | మం | ష 38.13 పూఫ 19-3 త్యా 3.59 |
| | 4 | బు | స 36.41 ఉఫ 19-6 సిద్ధియోగః |
| | 5 | గు | అ 36.26 హస్త 19.56 కాలభైరవాష్టమి |
| | 6 | శు | న 37.24 చిత్త 21.57 త్యా 4.13 |
| | 7 | శ | ద 39 32 స్వాతి 25.7 త్యా 4.17 |
| | 8 | ఆ | ఏ 42.41 విశా 29.18 |
| | 9 | సో | ద్వా 46 40 అనూ 34.19 త్యా 4-23 ప్రదోషాభావః |
| | 10 | మం | త్ర 51 12 జ్యే 39.54 త్యాజ్యాభావః |
| | 11 | బు | చతు 56-6 మూ 45.51 మాసశివరాత్రి |
| | 12 | గు | ● అమా 60.0 పూషా 51.55 |
| | 13 | శు | అమా 1 0 ఉషా 57.46 |
| | | | **పౌష్యమాసము** |
| | 14 | శ | శుక్లపా 5-33 శ్రవ 60.10 భోగ్యుత్సవం |
| | 15 | ఆ | విది 9.39 శ్ర 2.59 ఉత్తరాయణ పుణ్యకాలం |

Printed & Published by Dr. S. Seshagiri Rao, at Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.

